# ఇంటిల్లిపాది కేశ సంరక్షణ కోసం... విశ్వసించదగ్గది ఈ ప్రత్యేకమైన ఫామిలీ షాంపూ

# పామొలివ్



పామొలివ్ షాంపూ
రెగ్యులర్ లేదా అదనపు
పోషణకోసం ఎగ్ షాంపూ




పామొలివ్ అన్ని రకాల జుట్లకోసం ప్రత్యేకంగా సూత్రీకరించబడింది. జుట్టుని బాగా శుభ్రపరిచే ఓ గొప్ప ఆధునిక షాంపూ ఇది. అయినప్పటికీ, పిల్లలకు వాడదగ్గ కోమలత్వం దీనిలో ఉంది. ఇది, జుట్టుని మృదువుగా, ఆరోగ్యంతో నిగనిగలాడేలా చేస్తుంది.

అంతేకాదు, పామొలివ్ షాంపూ కుటుంబ బడ్జెట్‌కు అనువైంది. ఎందుకంటే, ఇటువంటి షాంపూల్లో అతి పొదుపైన ధరకు దొరికేది ఇదే!

## మీ బడ్జెట్‌కు అనువైన కుటుంబ కేశ సంరక్షణ

GK&E

# నోవీనో స్పెషల్




# జపాన్ తయారీ అంత మంచి ఇండియన్ బ్యాటరీ.

సహజమే! ప్రపంచ ప్రసిద్ధమైన నేషనల్, జపాన్ వారి సహకారంతో,
ఇండియాలోని అత్యాధునికమైన ఒక ఫ్యాక్టరీలో తయారైంది మరి,
నోవీనో స్పెషల్! నోవీనో ఫ్యాక్టరీలో, కచ్చితమైన నాణ్యత
తెప్పించడానికి, ప్రతి ఉత్పాదనా దశలోనూ ఎంతో
జాగ్రత్త తీసుకోబడుతుంది. అందుకే ఎక్కువ
వెలుతురూ, ఎక్కువ మన్నికా కలిగి,
మోసపోవడానికి వీలులేని
బ్యాటరీ మీకు దొరుకుతుంది.
అదే, జపాన్ సాంకేతిక
జ్ఞానం, ఇండియా నైపుణ్యంల
మేలు కలయిక!
అదే నోవీనో స్పెషల్‌ను
అంత విశిష్టంగా రూపొందించేది!




రాత్రిని పగలుగా
మార్చే బ్యాటరీ.

**నోవీనో**
మరింత[illegible]మైన బ్యాటరీ

లఖన్‌పాల్ నేషనల్ లిమిటెడ్
బరోడా, గుజరాత్.
నేషనల్, జపాన్‌వారి సహకారంతో
ఒక ఉమ్మడి సంస్థ.

Sista's-LNL-374/81 TEL

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 - 1972]

శుక్రవారం : 21-8-'81
దుర్మతి నామ సం. శ్రావణ బ. షష్ఠి
సంపుటము 74 : సంచిక 49

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**శుభాకాంక్షలు**

**మా పాఠకులకు, ఏజంట్లకు, ప్రకటనకర్తలకు స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు—సం॥**

# ఉత్తరాలు

### ముఖచిత్రం

24—7—81 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం సూర్య దేవుని రథచక్రం అత్యంత ఆకర్షణీయముగా ఉన్నది.

జాన నాగేశ్వరరావు, సూర్యషణ్ముకేశ్వరరావు, రామారావు, వెంకటేశ్వరరావు (వేమూరి)

* * *

24—7—81వ తేదీ ముఖచిత్రం కోణార్క్‌లోని సూర్యదేవుని రథ చక్రం ఎంతో బాగుంది. నిజంగా చూస్తున్నంత భ్రమ కలిగింది. అపురూపమైన మన శిల్ప కళాఖండము ఎంతో రిలీఫ్‌నిచ్చింది.

ఎస్. ఇందుముఖి (హైదరాబాదు)

* * *

24—7—81 నాటి ముఖచిత్రం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వెలువడిన "సూర్యదేవుని రథచక్రం, (కోణార్క్) మా హృదయాలను చాలా ఆకర్షించింది. చాలా మంచి ముఖ చిత్రం వేసినందుకు మా ధన్యవాదములు. దేవుడు చూస్తూనే ఉన్నాడులో ఈ ప్రపంచములో దేవుడి పేరు మీద జరిగే అన్యాయాలను రచయిత విపులంగా వ్రాశారు.

గోగుల యశోదాదేవి, భారతి (పిఠాపురం)

* * *

సూర్యదేవుని రథచక్రం (కోణార్క్) ముఖ చిత్రంతో వెలువడిన 24—7—81వ తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక నన్ను ఎంతగానో ఆకర్షించింది. మన సంస్కృతిని ప్రతిబింబించే కళాత్మక విలువలున్న ఇలాంటి ముఖచిత్రాలు ప్రచురించమని మనవి.

బొబ్బిలి బంగారయ్య (ఆకివీడు)

* * *

24—7—81న వెలువడిన "సూర్యదేవుని రథచక్రం (కోణార్క్) ముఖచిత్రంతో వెలువడిన వారపత్రిక చాలా చూడముచ్చటగా ఉంది. కళాత్మకమైన చక్కని ముఖచిత్రాన్ని అందించిన మీకు మా హృదయపూర్వక ధన్యవాదాలు.

సి. గంగాధర (ధర్మవరం)



# ఛార్లెస్, డయానాల వివాహమహోత్సవం

బ్రిటిష్ యువరాజు ఛార్లెస్, లేడీడయానా స్పెన్సర్‌ల వివాహం జూలై 29 నాడు అత్యంత వైభవోపేతంగా జరిగింది. చరిత్రాత్మకమైన సెయింట్ పాల్ కెథడ్రల్‌లో జరిగిన ఈ పెళ్ళికి అతి ముఖ్యులైన ఆహూతులే 2500 మంది. ఇక మిగతావారివిషయంచెప్పనక్కర లేదు. ప్రముఖ ఆహూతుల బృందంలో దేశదేశాల రాజులూ, రాణులూ, అధ్యక్షులూ, ప్రధానమంత్రులూ తదితర అంతర్జాతీయ ప్రముఖులూ ఉన్నారు. రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ఈ వివాహానికి హాజరైనారు.

బ్రిటన్‌లో యిటీవల చెలరేగిన జాతి పరమైన అల్లర్లు, అశాంతి ఈ వివాహ సందర్భంగా సద్దుమణగటం రాచరిక వ్యవస్థపై బ్రిటిష్ ప్రజలకి గల విశ్వాసానికి నిదర్శనం.

70 నిమిషాలపాటు జరిగిన ఈ వివాహ క్రతువుని ప్రపంచంలోని డెబ్బైకోట్ల మంది ప్రజలు టెలివిషన్‌లలో తిలకించారు.

ఇకనుంచి ఈ దంపతులను వేల్స్ రాకుమారుడు, వేల్స్ రాకుమారిగా పిలుస్తారు.

లోకంపోకడ * ఊరిమేన్







# ఉత్తరాలు

## బైస్కోపు బాతాఖానీ

17.7.81 సంచికలో వెలువడిన కల్పన అయ్యర్ ముఖచిత్రం ఆవారపత్రికకలకర్షణీయంగ ఉంది. ముఖ చిత్రాల ప్రచురణలో గ్రేడ్—1గా పత్రిక నిలువడం నిజంగా పాఠకులందరికీ గర్వ కారణం. ప్రారంభ సీరియల్స్, సాగుతున్న సీరియల్స్, కథలు ముచ్చటగా ఉన్నాయి. కార్టూన్స్‌లో "కాటూరి" ముందు సీటు, చెట్టు క్రింది నానా కాలం ఎదువులు కూడా బాగున్నాయి.

బైస్కోప్ బాతాఖానీలో విశ్వనాథ్—సప్తపది గురించి వీరాజీ విరచితమైన వ్యాసం, చక్కటి మెచ్చుకోలు చలోక్తులతో బాగా ఆసక్తికరంగా ఉండి, నా చేత మూడు సార్లు చదివించింది.

పెన్మెత్స సూరిబాబు (హైదరాబాద్)

## ఫాలాక్షుని డైరీ

24—7—81 తేదీతో వెలువడిన మా అభిమాన ఆంధ్ర పచిత్ర వారపత్రికపై ప్రచురించిన ముఖచిత్రం సూర్యదేవునిరథచక్రం మమ్మల్ని ముగ్ధులను చేసింది. ఈ ముఖచిత్రం, 20వ పేజీలో ప్రచురించిన ఫోటో ఈవారం—సంచికకే "హైలైట్" అని చెప్పడం అతిశయోక్తి కాదు. 'పరీక్ష' కథ మామూలుగా ఉంది. సహనానికి పరీక్ష కథలో ముగింపు బాగాలేదు. ముగింపుకు రచయితబలం చేకూర్చలేకపోయారు. ఫాలాక్షుని డైరీలో తమ్ముడు తెచ్చిన తంటా! వంటి రాజకీయపరమైన వార్తలు ప్రచురించవలదని ఫాలాక్షుడు గారికి మా విజ్ఞప్తి. మాకు తెలియని వార్తలను, వింతలను, విశేషాలను మాత్రమే ప్రచురించవలసినదిగా కోరుచున్నాము

టి. వి. శ్రీనివాసరావు, టి. సత్యప్రసాదరావు (అండలూరు)

## కోణార్క్

24.7.81 సంచిక పై ముఖ చిత్రంగా "కోణార్క్ సూర్యదేవుని రథ చక్రం" చూసి అనిర్వచనీయమైన ఆనందానికి లోనయ్యాం. ఏడు శతాబ్దాల నాటి శిల్ప కళాచాతుర్యాన్ని చూస్తుంటే ఆ శిల్పికి జోహార్లు అర్పించాలని అనిపించింది. అసాధారణమైన అమూల్యమైన శిల్ప సంపదగల భారత భూమి: ధన్య భూమి.

మాటేకాని ప్రకాష్ (విజయనగరం)

## ధర్మపథం

3.7.81 సంచికలో "మూడు" ప్రాధాన్యం గూర్చి ఇలుసు వేంకట రమణయ్య గారు బాగా విపులీకరించారు. పెండ్లికి మూడు ముళ్ళ ప్రాధాన్యమేమిటో అర్థమయింది. పెళ్ళి ప్రేమతో ముడిపడ్డ నేటి సమాజంలో మూడు ముళ్ళు సంగ్ర ప్రశ్నార్థకమే మరి?...

పి. సుభాషిణి (కోరుకొండ)

(66 వ పేజీ చూడండి)

సీరియల్

# నర్సింగ్‌హోం

శ్రీరంగం

నర్సింగ్‌హోం మెయిన్ ఎంటన్సుకి కారిడర్ అంటూ వుంది. అక్కడ ఒక టేబిలు, కుర్చీ, ఫోను ఉంది. అతను వెళుతూంటే స్టెయిన్‌లెస్ జాకెట్టుమీద సన్నటి నైలాన్ చీరతో, చాలా అధునాతనంగా ఉన్న ఒకామె టేబిలుమీదకూర్చొని మాట్లాడుతుంటూంది. ఆమె వొంగిపోయి పమిట ఎక్కడ వుందీ అన్న ధ్యాస అయినా లేకుండా తన్ను తాను మరచిపోయింది. అప్పుడప్పుడు నవ్వులు. ఇదివరలో తను ఆమెని రెండుసార్లు చూసేడు. ఎవరో పేషంటు అటెండరు అనుకున్నాడు. ఎంత అటెండరు అయితే మాత్రం అలా త్రోవలో ఆ విధంగా కూర్చొని ఆమె మాటాడుకోవడం తనకు నచ్చలేదు. 'కొంచెం సరిగా కూర్చొని మాట్లాడండి' అందాం అనుకుని 'తను చెబితే బాగుండదేమో తర్వాత సిస్టర్‌కి చెపుదాం' అనుకున్నాడు.

ఇంతలో అటెండరు పరిగెత్తుకుంటూ వచ్చి 'సార్! మీరు అర్జంటుగా మీ గదికి రావాలి' అన్నాడు.

'సరే' అంటూ వెళ్ళిపోయేడు.

తన కన్సల్టింగ్ రూంలో ఎగ్జామినింగ్ టేబుల్‌మీద ఒక నలభై అయిదేళ్ళ వ్యక్తి పడుక్కొని ఉన్నాడు. అతని వొంటినిండా చెమటపట్టి ఉంది. స్పృహ లేకుండా పడివున్నాడు.

'ఎవరు యితనితో వచ్చేరు.'

'నేను' అంటూ ఒక చింకి చీరలో, పసుపుకొమ్ములతో సహా వల్లబడిన మంగళసూత్రంతో ఒక ముప్ఫయి యేళ్ళామె ముందుకు వచ్చింది.

అమెను చూస్తుంటే దరిద్రం అంతా యీామె ఉంచుకుందా అనిపించింది. ఆ కళ్ళలో

(గత సంచిక తరువాయి)

దైన్యం ముఖంలో నిస్సహాయత రాజాని కదిలించేసేయి.

'ఎవరండీ యితను?' అన్నాడు.

'మావారండీ' అంది.

'ఏమయింది?' అన్నాడు.

'భోజనానికి కూర్చోబోతూ విరుచుకుపడిపోయేరండీ! ఆసుపత్రికి తీసుకెళుతూంటే త్రోవలో ఎవరో ఆసుపత్రిలో డాక్టర్లు స్ట్రయిక్ - తీసుకెళ్ళి ప్రయోజనంలేదన్నారు. రిక్షావాడు ఇక్కడకు తెచ్చేడు' అంది.

వారం రోజులనించీ ఆసుపత్రిలో హౌస్ సర్జన్లు స్ట్రయిక్ - వాళ్ళ స్టయిఫెండు ఎక్కువచేయాలి అని రెండు రోజుల నించి అసిస్టెంట్లు కూడా వాళ్ళతో కలిసేరు. ఆసుపత్రి మొత్తం పెరలైజ్ అయింది.

'ఎందుకు పడిపోయేడో తెలుసా?' అన్నాడు.

'తెలీదండీ.'

తిరిగి ఆమెను చూసేడు. 'యీామెకు యిక్కడి చార్జీలు పెట్టుకొనే స్తోమత ఉందా' అన్న అనుమానం కలిగింది.

ఆమె అతని అనుమానం చదివినదానిలా తన కాలినున్న వెండి మట్టెల్ని తీసి బల్లమీద ఉంచుతూ 'మీ ఫీజు' అంది.

ఆమె వొంటిమీదనున్న ఒకేఒక ఖరీదైన వొస్తువు అది

ఎగ్జామినింగ్ టేబులుమీద పడుకున్న అతను చెమటలు తెగ కార్చేస్తున్నాడు. వొచ్చినప్పటికి యిప్పటికి పరిస్థితి యింకాస్త దిగజారింది. తొందరగా చేయవలసిన పరీక్షలన్నీ రెండు నిముషాలలో పూర్తి చేసేడు. స్పృహ తప్పి ఉన్న అతన్ని గూర్చి ఏ నిర్ధారణకూ రాలేకపోయేడు

తిరిగివచ్చి కుర్చీలో కూర్చొని కళ్ళు మూసుకున్నాడు. భోజనానికి ముందు కూర్చొని చెమటలతో స్పృహతప్పడంటే ?

కళ్ళు తెరచి "అమ్మా యీరోజు వంట కాస్త ఆలస్యం అయిందా ?' అన్నాడు.

'అవునండీ' అంది.

'ఇతనికి షుగరు వ్యాధి లేదుకదా'

'నాకు తెలియదండీ'

లేచివచ్చి అతని చేతులు చూసేడు. ఏంలేదు. పంచె పైదకు లాగి తొడ అవతల భాగం చూసేడు. అక్కడక్కడ యింజక్షను గుర్తులు.

'ఊహూ' అనుకుని 'సిస్టర్' అన్నాడు.

**జరిగినకథ - 5 :** డాక్టర్ రాజా ఎం.డి. లో గోల్డ్‌మెడల్ సంపాయించు కొంటాడు. ఇప్పుడు అతను తన కుటుంబాన్ని మోయవలసి వున్నది. రాజా, మంజుల ఇరువురూ ఒకరినొకరు పరస్పరం ప్రేమించుకొంటారు. అతను ప్రాక్టీసు పెట్టి, కొంత ఆర్థికస్తోమత చిక్కిన తరువాత పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించు కొంటారు. డా. విశ్వం సహాయంతో ప్రాక్టీస్ పెడతాడు రాజా. ఎం. బి. బి. యస్. పూర్తి కాకుండానే కొంతడబ్బు ఖర్చుపెట్టి ఆర్. ఎం. పి. డిగ్రీ తీసుకొని డిస్పెన్సరీ తెరుస్తాడు డా. రాధాకృష్ణ. అతను తన భార్య సుగుణకు కూడా ఓ ఆర్. ఎం. పి డిగ్రీ సంపాయించి ఆమెను తన డిస్పెన్సరీలోనే లేడీ డాక్టర్‌గా వేసుకొంటాడు. డాక్టర్ విశ్వం దగ్గరకు ఓ అమ్మాయి వచ్చి, మీరు లోగడ నా భర్తకు చేసిన 'వేసక్టమీ' ఆపరేషన్ ఫెయిల్ అయిందని అతనితో చెప్పమని, ఫీజు క్రింద తన గాజులు తీసి యిస్తుండగా, విశ్వానికి అహం అడ్డురాగా బయటకు పొమ్మంటాడు. ఆమె పోతుండగా భర్త పేరు అడిగి తెలుసుకొని ఆమెకు సహాయం చేస్తాడు. డా. రాధాకృష్ణ ఎక్స్‌కౌన్సిలర్ సహాయంతో ఓ మందులషాపు పెట్టి, అందులో చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్న తన తమ్ముడికు దొంగ సర్టిఫికేట్‌లు సంపాయించి వాళను అందులో వుంచుతాడు. డా. విశ్వం నర్సింగ్‌హోం మేనేజర్ జబ్బుచేసి వెళ్ళిపోతే, అతను వచ్చేవరకు ఆ సీటు డాక్టర్ రాజాకు అప్పగించుతాడు విశ్వం








# నర్సింగ్ హోం

'నర్స్ వచ్చింది. హండ్రెడ్ సీసీ 50శాతం గ్లూకోజ్ యివ్వండి! అర్జంట్ అన్నాడు'

రెండు నిముషాల్లో అతనికి యివ్వడం పూర్తయింది. అప్పటికి అతని చెమటలు తగ్గేయి. వెయిన్‌లోంచి నీడిల్ తీయగానే అతను కళ్ళు తెరచేడు.

ఎదురుగా ఉన్న డాక్టర్నీ, ప్రక్కనఉన్న నర్సునీ, పాదాలవద్ద ఉన్న భార్యానీ చూసి 'నాకు ఏం అయిందండీ?' అంటూ అడిగేడు

'ఇన్సులిన్ ఓవర్ డోసేజ్' అన్నాడు డాక్టర్ రాజా.

'లేదండీ' అని వెంటనే తప్పు సరిదిద్దుకున్న వాడిలా 'అంటే?' అన్నాడు.

'అంటే మీకు తెల్సు' అన్నాడు రాజా.

అతను తన భార్యను బయటికి వెళ్ళమని సౌంజ్ఞ చేసేడు.

ఆమె పోయింది. అతను నోరు మెదప లేదు

రాజా నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ 'అవునా?'

'అవునండీ' అన్నాడు అతను.

'మీకు షుగర్ వ్యాధి ఉందని, మీరు యిన్సులిన్ యింజక్షను తీసుకుంటారని మీ భార్యకు తెలియదా!'

'తెలియదండీ' అన్నాడు.

'ఎందుకని'

'నా జబ్బు నా భార్యకు చెప్తే యింకేం అయినా ఉందా? నా అన్నంలో మట్టి బెడ్డ వేసుకున్నట్టే' అని రాజా ముఖంలో చూస్తూ 'మీకు అర్థం అయినట్లు లేదు. నా వృత్తి పౌరోహిత్యం, నాకు ఏనిమిది మంది పిల్లలు. సాధారణంగా నేను తద్దినాలకూ, సమారాధనలకూ వెళుతూంటాను. నేను భోంచేయడం తంతులో ఒకభాగం. నేను చేయను అంటే వేరే వాళ్ళను ఎవరినేనా పిలుచుకుంటారు. నా భార్యకు నాకు డయబటీస్ ఉందని తెలిస్తే వెళ్ళనీయదు. నేను వెళ్ళకపోతే నా కుటుంబం అంతా మాడాల్సిందే. అందుకే ఆమెకు తెలియకుండా నాలుగేళ్ళనించి అతి జాగ్రత్త పడుతూ వస్తున్నాను.'

'పథ్యమే ట్రీట్‌మెంట్‌లోని ముఖ్యభాగం. అది వొదిలేసి మీరు ఎంత యిన్సులిన్ తీసుకుంటే ఏం లాభం'

'కొందరిని యీ పూట గడుస్తే చాలు

అనే జీవితాలు. నాదీ అలాంటి జీవితమే.'

'సరే చెప్పడం నా ధర్మం చెప్పేను'

'నా భార్యకు ఈ సంగతి చెప్పకపోవడం కూడా మీ ధర్మమే డాక్టర్! అదికూడా నెరవేరుస్తారా?'

రాజా అతని మీదనించి కళ్లు తిప్పకుండా చూపి 'సరే' అన్నాడు.

మరో రెండు నిముషాలకు అతను లేచి కూర్చున్నాడు. 'డాక్టర్ యిక నేను వెళ్లొచ్చా' అన్నాడు.

'వెళ్ళండి' అన్నాడు రాజా.

అతను నమస్కారం చేసి వెళ్ళబోతూంటే 'మీ భార్యకు యివి యిచ్చేయండి' అంటూ టేబులుమీద మల్లెలు చేతికి యిచ్చేడు.

అతను అందుకోడానికి కొంచెం జంకేడు.

'ఫర్వాలేదు ఉంచండి' అని బలవంతం మీద చేతిలో ఉంచి 'యికవెళ్ళండి' అన్నాడు. 'నా పేరు సుబ్బయ్య. అప్పుడప్పుడు వొచ్చి తమ దర్శనం చేసుకుంటాము' అంటూ నిష్క్రమించేడు.

రాజా తిరిగి లేచి నర్సింగ్‌హోంలోకి వెళ్లేడు. అక్కడ తను యిందాక చూసిన ఆమె యింకా మాట్లాడుతూంది. టైము చూసుకున్నాడు. పన్నెండున్నరఅవబోతూంది. అరగంటసేపు ఫోనులోనా? ఆమె దగ్గరికి వచ్చి 'మేడమ్ చూడండి. మీరు ముఖాముఖీ మాట్లాడినంతసేపు ఫోనులో యిలా మాట్లాడితే మాకువచ్చే కాల్సు ఏంకావాలి?' అన్నాడు.

ఆమె ఫోను స్పీకరు, చేత్తో మూస్తూ 'అర్జంటు ఏమయినా ఉంటే మాట్లాడేందుకేగాండీ ఫోను' అంది చిరుకోపం ప్రదర్శిస్తూ.

'ఫోనులో నవ్వడం కూడా అర్జంటేనా' అని అడుగుదాం అనుకుని యిది నర్సింగ్ హోం, యిక్కడ మాటకు మాట పెంచుకుంటే బాగుండదు అనుకుని 'మీ పని తొందరగా అయిపోతే నేను మాట్లాడాలి' అన్నాడు ఫోనుతో అవసరం లేకపోయినా అబద్ధం ఆడుతూ.

ఆమె వొక నిముషం తర్వాత ఫోనుపెట్టేసి లోనికి పోబోయింది. 'అమ్మా మీరు చూడదలచుకున్న పేషంటును విజిటింగ్ అవర్సులో చూస్తే బాగుంటుంది' అన్నాడు. ఆమె విసురుగా 'నేను నీవరినీ చూడక్కరలేదు. నేనే పేషంటుని' అని రూం నెంబరు వొకటి గదిలోకి వెళ్ళి తలుపు మూసుకుంది.



ఈమె డ్రెస్సింగు చూస్తే పేషంటులా కనపడటంలేదు. ఏంజబ్బో? అనుకుంటూ వెళ్లబోతూ ప్రక్కనించి వెళుతున్న నర్సుతో నెంబరు వన్ కేస్ గురించి అడిగేడు. 'నాకు తెలియదు డాక్టర్. ఆమె అడ్మిట్ అయి వొక నెలరోజులు అయింది ఇప్పుడప్పుడే వెళ్లేటట్లు కనిపించటంలేదు'

ఎవ్వడేనా విశ్వంగారినే అడగాలి అనుకుని నర్సింగ్‌హోం అంతా తిరిగేడు. నర్సింగ్ హోంలో మూడురకాల గదులున్నాయి: వొకటి యాభై రూపాయలది ఎయిర్‌కూలర్ గది. అక్కడ అటెండెంట్ కాట్ కూడా ఉంది. రెండు ఎయిర్ కూలర్ లేనిది. అది నలభై. అక్కడకూడా అటెండెంట్‌కాట్ ఉంది. మూడు సింగిల్‌రూం. ముప్పై. నర్సింగ్ హోంకి రెండు ఫోన్లున్నాయి. వొకటి ఆపరేషన్ థియేటర్‌లో ఉంది. మరొకటి వరండాలో.

ఇక్కడ అయిదుగురు నర్సులూ, అయిదుగురు వార్డుబాయ్‌లు, అయిదుగురు ఆయాలు ఉన్నారు. ప్రతీగదికీ అటాచ్‌డ్ బాత్రూంలూ లెట్రిన్లూ ఉన్నా నర్సింగ్‌హోంకి కామన్‌గా మూడు బాత్‌రూంలూ, లెట్రిన్లూ ఉన్నాయి వరసగా వరండాకి ఎదురుగుండా. అవి

# నర్సింగ్ హోం

పేషెంటును ప్రిపేర్ చేయడానికీ, ఎనిమా యివ్వడానికే రాజా రవుండ్స్ తీసుకుంటుంటే వాటిముందర యిద్దరు ముగ్గురు తచ్చాడ సాగేరు.

నర్సింగ్‌హోంలో ప్రశాంతత కనిపించ లేదు. ఏదో విజిటింగ్ అవర్సులో ఉన్న సందడి ఉంది.

రాజా తన గదికి వచ్చి కుర్చీలో కూర్చొని ఎటెండరుతో 'యిన్‌చార్జి సిస్టర్‌ని పిల్చుకురా' అన్నాడు.

'వొస్తున్నాను' అని చెప్పి పంపిన అర గంటకు ఆమె వొచ్చింది.

ఆమె రాగానే ''సిస్టర్! యిక్కడ ఫోను మీద గంటలకొద్దీ జనం మాట్లాడుతారు. రెండోది ప్రతీ గదికి ఎటాచ్‌డ్ బాత్‌రూం ఉంటే– యింకా యీ కామన్ బాత్‌రూంకి యింత జనం ఏంటి? మూడోది విజిటింగ్ అవర్సులో తప్ప మిగతా టైములో విజిటర్సు లోనికి రాకూడదు– యివన్నీ జరిగేటట్టు చూడండి.''

'వీళ్ళంతా వినరు సార్' అంది.

'ప్రయత్నించండి.'

'లాభంలేదండీ ఏమయినా అంటే మేం చార్జీలు కట్టుకోటంలేదా' అంటారు. యిక్కడ వచ్చినవాళ్ళకు చాలామటుకు డబ్బో పలుకుబడో తప్పకుండా ఉంటుంది. అందుకే గట్టిగా మాట్లాడాలంటే కష్టం.'

'సరే నువ్వు వెళ్ళు' అని ఆలోచించ సాగేడు రాజా.

* * *

డాక్టర్ శేఖర్ బాస్ చంద్రశేఖర్ చండ శాసనుడు. అతన్ని అడగకుండా వార్డులో పేషంట్సుకు ఎవరూ యింజక్షను కూడా రాయకూడదు. అసిస్టెంట్సు పని బాస్ వెనకాల ఎప్పుడూ ఉండడం. అతను ఎక్కడికెళితే అక్కడికి వీళ్ళూ వెనక రావడం. అతని వోఫీ అంతా ఎప్పుడూ పొలిటీషియన్సుతో నిండి ఉంటుంది. అతని దగ్గరకు వొచ్చే ప్రతీవ్యక్తీ ముఖ్యుడే. అందుకే అతను వొంగి వొంగి సలాములు చేస్తూ, అందరికీ అమిత గౌరవం యిస్తూ బాస్‌లాగా కాకుండా సేవకుడిలా కనిపిస్తాడు.

అతను పదకొండేళ్ళనించీ వొకే ఆసుపత్రిలో ఉన్నా, అతన్ని అక్కడి నించి ఎవరూ

## స్వాతంత్ర్యం యెప్పుడు ?

నాకూ స్వతంత్రం వచ్చిందన్నాడో నేతాజీ
దొరల్ని దోచటానికీ, దొంగల్ని దాచటానికీ.
నాకూ స్వతంత్రం వచ్చిందన్నాడో వ్యాపారి
ధరల్ని పెంచటానికీ, పేదలను తుంచడానికీ.
నాకూ స్వతంత్రం వచ్చిందన్నాడో సగటు మనిషి
తన పొట్టకోసం పక్కవాణ్ణి పొడి చెయ్యటానికి.
వీళ్ళందరి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు విలపించే భరతమాత
కన్నీటిని తుడిచేందుకు మన జనతకు స్వాతంత్ర్యం యెప్పుడు ?
సమతా మమతల కృషికోసం స్వేచ్ఛ యెప్పుడు యువతకు ?
కలకాలపు కష్టాలను, కలికాలపు నష్టాలను తొలగించి
నవసమాజ సంస్థాపన సాగిపోవు స్వాతంత్ర్యం యెప్పుడు ?
మహనీయుల మహాకృషికి అచ్చమైన చరితార్థత యెప్పుడు ?

— "సుచంద్ర"

కదల్చలేకపోయేరు. 'నేను రిటైరుమెంటు కూడా యిదే ఆసుపత్రినుంచి అవుతాను' అంటాడు చంద్రశేఖర్– హాస్యం మూడ్సులో ఉన్నప్పుడు.

పొలిటీషియన్ను కాకుండా మిగతా అతని హోపీ కేసులన్నీ యింట్లో డబ్బు కట్టినవే. సాయంత్రం అతని క్లినిక్ కిక్కిరిసి ఉంటుంది. అంచనా ప్రకారం అతని ఆర్జన రోజుకి వొక వెయ్యిదాకా ఉంటుందని. అతను తన కన్సల్టింగ్ ఫీజు తీసుకొని పేషంటుని పరీక్షచేసి, అక్కడే రాసేస్తాడు, మర్నాడు ఆస్పత్రిలో ఏడ్మిషన్ గురించి. అలా రాసిన చీటి తన కాంపౌండరుకిచ్చి పేషంట్నితో కాంపౌండరునించి చీటీ తీసుకోమంటాడు. పేషంటు చీటీ తీసుకుందికి కాంపౌండరు దగ్గరికెళితే కాంపౌండరు యాభై యివ్వాలి అంటాడు.

'ఏందుకు?' అని అడిగితే మరి 'అడ్మిషను ఫీజు' అంటాడు. 'యిప్పుడే యిరవై అయిదు యిచ్చేం కదండీ' అంటే అది 'కన్సల్టేషన్ ఫీజు, అంటే మిమ్మల్ని పరీక్ష చేసినందుకన్నమాట. ఇది అడ్మిషన్ ఫీజు అంటే మిమ్మల్ని ఆసుపత్రిలో చేర్చు కొనేందుకన్నమాట.'

'ఇది ధర్మాసుపత్రికదయ్యా, నర్సింగ్ హోంకి కట్టిమన్నట్టు డబ్బు కట్టు అంటా వేంటి?' అని ఏవరయినా అడిగితే 'అక్కడి కెళితే మిమ్మల్ని పట్టించుకునేది ఏవరు?

# నర్సింగ్ హోం

మిమ్మల్ని గుర్తించాలంటే– యీ ఫీజు తప్పదు' అనేవాడు.

ఏవరైనా అతి తెలివి ప్రదర్శిస్తూ మేం డాక్టరుగారినే అడుగుతాం అంటే 'వెళ్ళండి, డాక్టరుగారే యీ ఫీజు చెప్పమన్నారు' అంటాడు. అతని మాటలు నమ్మక ఏవరేనా డాక్టరు దగ్గరికి వెళితే అతను నిర్మోహ మాటంగా 'డబ్బు యివ్వాలండీ, లేకపోతే మీ రిచ్చే యిరవైలో పరీక్ష చేయడం, అడ్మిట్ చేయడం, ఆపరేషన్ చేయడం యివన్నీ అయి పోతాయా? ఏంత వెర్రివాడివి' అంటూ హేళన చేసేవాడు.

పేషంట్లు యాభై యిచ్చి అడ్మిట్ చీటీ తీసుకుని అతని హోపీ రోజు హాస్పిటల్‌లో చేరేవారు. అక్కడినించి వాళ్ళ పాట్లు మొద లయేవి. ఆసుపత్రిలో బెడ్, భోజనం దొరుకు తుంది. మొదటి రెండు రోజులూ—కావలసిన పరీక్షలన్నీ పూర్తి అవుతాయి. తర్వాత యింకెవరూ పట్టించుకోరు. వచ్చినవాడ్ని రోజులతరబడి ఉంచేస్తే ఏన్నాళ్ళు ఉంటాడు? కొందరు వెనుక వచ్చినవాళ్ళు పని పూర్తి చేసుకుని వెళ్ళిపోతూంటే– ముందు వచ్చిన కొందరు శివాలయంలో విగ్రహాంలా ఉండి పోయేవారు. ఏవరికీ అక్కరలేని వీళ్ళని ప్రక్క బెడ్లవాళ్ళు 'మీరు డాక్టరుగారి యింటికి వెళ్ళి కలిసేరా' అని. వార్డు బాయిస్ 'సాయంత్రం బాస్ క్లినిక్‌కి మీ వాళ్ళను పంపించండి. లేకపోతే మిమ్మల్ని ఏవరూ పట్టించుకోరు' అని రోజూ పోరు పెడ్తారు.

వార్డుబాయిస్ తోసినా ముందరకు వీళ్ళు కదలకపోతే అసిస్టెంట్లు 'బాస్‌ని కలిసి యీ గొడవ వొదిలించుకోకూడదా' అంటూ సలహాలిస్తారు. ఇంకా పేషంటు మరీ మొండి కేస్తే బాస్ స్వయంగా 'ఏంటయ్యా, మీ వాళ్ళు నీగురించి ఏం పట్టించుకోటం లేదేంటి? ఏవరూ వచ్చి కలవకుండా ఏన్నాళ్ళు ఉండిపోతావు?' అంటూ ఆయనే అడిగేస్తాడు. అలా అడిగినా లాభం లేకపోతే, అతను ఆపరేషన్ చేసి అయినా వొదిలించు కుంటాడు, లేకపోతే 'యింకొన్ని రోజులు మందులు వాడిచూద్దాం యిప్పుడేం ఆపరేష న్‌కి అవసరం కనిపించటంలేదు' అని డిస్చార్జి చేసేస్తాడు అప్పటివరకూ ఆపరేషన్ కేసు నాన్ ఆపరబుల్ కేసు అవుతుంది.

డాక్టర్ చంద్రశేఖర్ ప్రాక్టీసు అలా ఉంటుంది. ఇంటిదగ్గర డబ్బియకుండా అతను కేసు చూడడు. ఆసుపత్రిలో అడ్మిషన్ కావలసినవారు తప్పకుండా అతనికి ముడుపు చెల్లించాల్సిందే. అతని అసిస్టెంట్లకు అడ్మిట్ చేసుకొనే పవర్ లేదు. వాళ్ళ బంధువుల్ని కూడా 'మా వాళ్ళు' అని చెప్పి ఏడ్మిట్ చేసుకోలేరు. వొకవేళ అలాచెబితే బాస్ చాలా అనుమానంగా, అసహ్యంగా చూస్తాడు. 'డబ్బు గురించి దారినపోయే దానయ్యను మా బంధువు అని చెప్పి అడ్మిట్ చేయించే స్థితికి దిగజారిపోయేవా' అన్నట్టుంటాయి అతని చూపులు. అందుకే ఏ అసిస్టెంటూ వాళ్ళ బంధువుల్నీ, స్నేహితుల్నీ అతని దగ్గరకు తీసుకురారు. వొకవేళ అవసరం ఉంటే అతని యింటికి పంపి డబ్బు యిప్పించేస్తారు.

డాక్టర్ శేఖర్ యీ బాస్ చేతికింద నలిగి పోతున్నాడు. డాక్టర్ విశ్వం ఉన్నప్పుడు ఉన్న స్వాతంత్రం అసలేలేదు. ఇప్పుడు కాంప్లికేటెడ్ కేసెస్ కాదు మామ్మూలు కేసులు ఆపరేట్ చేసేందుకు కూడా ఛాన్సులేదు. అన్నీ బాస్ కేసులే. సర్జరీ లేక అతని చేతులు తుప్పుపట్టి పోతున్నాయి. ఏంతసేపూ హోపీలో యాబ్సిస్ వోపెన్ చేయడం, పిస్టులు కోయడం–యివి అసిస్టెంటు చేస్తున్న పనులు యీ వార్డులో! అతనికి అనిపిస్తూంది యీ వార్డుకు అసలు అసిస్టెంటులు అవసరం లేదనీ, చీటికిమాటికి యిక్కడ జరిగే ఘోరాలు

## నర్సింగ్ హోం

తను చూడలేకపోతున్నాడు యిక్కడ ప్రతి దానికీ రేటుంది. ఎనిమా యివ్వాలంటే ఎనిమిదణాలు తీసుకుంటాడు, వార్డ్ బాయి. బెడ్‌పాన్ యివ్వాలంటే పావలా. కేకేసి చేతులతో డబ్బు దూరంనించే చూపించక పోతే ఎవరూ రారు. అందుకే అడ్మిట్ అయిన ప్రతీ పేషంటూ కొంత చిల్లర ఉంచుకుంటాడు.

ఆసుపత్రిలో అప్పటికీ యిప్పటికీ వొక్కలాగున్నది నర్సులు మాత్రమే. వాళ్ళు విసుక్కోరు. ఏగాని ఆశించరు. వాళ్ళు దానకోకుండా పనిచేస్తారు. వాళ్ళేగాని లేకపోతే ...

శేఖర్ ఆసుపత్రికి ఎనిమిదిన్నరకి వస్తాడు. వచ్చినప్పటి నించీ బాసు వచ్చేదాకా వెయిట్ చేయాలి. అతను వచ్చినతర్వాత రవుండ్స్ మొదలవుతాయి. వొక్కో కేసు దగ్గర తీరికగా పొల్లు మాటలు మాట్లాడుతూ, మంచందగ్గరనించి కదలనే కదలడు బాస్. డబ్బు యివ్వని పేషంట్లను, అసలు పలకరించనే పలకరించడు.

అతని థియేటర్ రోజు చాలా గమ్మత్తుగా ఉంటుంది. చిల్లర ఆపరేషను కూడా అతనే చేస్తాడు. అతను చేస్తూ, అతను ఫారిన్‌లో ఉన్నప్పుడు ఎంత తెలివిగా ఉండేవాడో చెబుతూంటే, చేతులు కట్టుకుని అసిస్టెంట్లు నిలబడాలి. 'ఆ బోర్ మాటలు ఎవరు భరిస్తారు' అని అతను వొకసారి వెళ్ళలేదు థియేటర్‌కి. బాస్ చెడామడా తిట్టేసేడు అతను రానందుకు

పిల్లలకి టీచ్ చేయడం, క్లాసులు తీసుకోవడం అంతా శేఖర్‌కే పూర్తిగా వొదిలేసేడు. అందులో మాత్రం అతను అసలు జోక్యమే కలిగించుకోడు.

శేఖరుకి అప్పుడప్పుడు తను యీ ఉద్యోగం వదిలేద్దాం అనిపించేది కాని తనేగాని యీ ఉద్యోగం వదిలేస్తే తన భార్య గతేం కావాలి? తాము ఏం తింటారు? దీనికి తోడు మెల్లగా తీరుతున్న పదివేల రూపాయల అప్పు. తనకే గాని ఏ బాధ్యతలు లేకుండా ఉండి ఉంటే తను ఎప్పుడో యిలాంటి ఉద్యోగం మానేసే వాడే.

పోయిన సంవత్సరమే తను సూపర్ ఎం. ఎస్. కి వెడదాం అనుకున్నాడు. కాని




ఆ పదివేల అప్పు కదలనీయలేదు. యీ సంవత్సరంతో అప్పు తీరిపోతుంది. తను వెళ్ళాలి. పోస్టు గ్రాడ్యుయేషన్‌తో తన ఆకలి తీరలేదు. ఇంకా చదవాలి ఇంకా తెలుసుకోవాలి.

ఇలాంటి రోజుల్లోనే డాక్టర్ చంద్రశేఖర్ తల్లి గుండెపోటుతో మరణించింది, దూర దేశంలో ఉన్న వాళ్ళ అన్న దగ్గర. రెండు సంవత్సరాలలో ఒక్కరోజు అయినా లీవు తీసుకోని చంద్రశేఖర్ పదిహేను రోజులు తల్లి కర్మ గురించి వెళ్ళవలసి వచ్చింది.

ఆ టైములో అసిస్టెంట్లు పండగే చేసుకున్నారు. ఎవరికి కావలసిన కేసులు వాళ్ళు ఎడ్మిట్ చేసుకున్నారు. శేఖర్ ముఖం తిరిగి ప్రకాశించసాగింది అతను ఎన్నో ఏళ్ళతర్వాత స్వేచ్ఛగా ఊపిరి తీసుకున్నట్టయింది. డాక్టర్ విశ్వం పోవడంతో నే ప్రక్కకు పెట్టేసిన కత్తి తిరిగి పట్టుకున్నాడు. హోప్లెస్ కేసులూ, కాంప్లికేటెడ్ కేసులూ మీద దండయాత్ర మొదలు పెట్టేడు. చంద్రశేఖర్ లేని పదిహేను రోజుల్లో తన తృప్తితీర ఆపరేషన్లు చేసేడు. కాని యీసారి దురదృష్టవశాత్తూ చాలా కేసులు బ్రతకలేదు అతను ముట్టిన కేసులన్నీ పోయేవి. డాక్టర్ శేఖర్ అంటే యముడు— అతను ఉన్న వార్డు యమవార్డు అన్న పేరు— చాలా త్వరలో తక్కువ వ్యవధిలో సంపాయించి పెట్టేడు.

తను చెయ్యవలసిన కర్మలన్నీ పూర్తిచేసి పదిహేను రోజుల తర్వాత తలమీద టోపితో వచ్చిన చంద్రశేఖర్— తన వార్డుకు వచ్చిన పేరు చూసి కోపంతో ఊగిపోయేడు. శేఖర్ని తన గదికి పిలిచి 'ఏంటి వార్డంతా యిలా తగలెట్టేవేంటి?' అంటూ తీక్షణంగా అడిగేడు.

'ఏంలేదు సార్ కేసులు సీరియస్‌వి సార్'

'సీరియస్‌గా వున్న కేసులు ఎందుకు తీసుకున్నావేంటి?'

'ఎవరూ వాటిని తీసుకోకపోతే ఎలాసార్?'

'ఎవరూ తీసుకోరని నా వార్డు మీదకు తెక్కిస్తావా? అలా ఎక్కిస్తే పేరు ఏమైపోయింది. చచ్చినవాళ్ల గురించి చంద్రశేఖర్ వార్డులో పోయేరు అంటారు గాని నీవారులో అనరుగా. నేను రెండేళ్లలో రెండే రెండు డెత్ సర్టిఫికెట్‌లు రాసేను.

నువ్వేమో పదిహేను రోజుల్లో, యిరవై. చాలా ఘనుడవే' అని—

'యీ రోజు నించి నా వార్డులో అడుగు పెట్టకు' అంటూ చాలా హీనంగా మాట్లాడేడు.

రెండురోజుల తర్వాత డా. శేఖర్ని సి. యం. వో.గా ట్రాన్స్‌ఫర్ చేయించేడు చంద్రశేఖర్.

సియంవో పని ఎప్పుడూ కాఘువాలిటీలో కూర్చోడం, అక్కడ చాలాభాగం మెడికో లీగల్ కేసులు చూడడంతోనే పోతుంది. దెబ్బలాటలు, పొడుచుకోవడాలూ, విషం త్రాగేసి ఆత్మహత్యా ప్రయత్నం చేసుకోవడం లాంటివి —మెడికోలీగల్ కేసులు అంటారు. దెబ్బ తగిలిన వ్యక్తి దెబ్బలు పరిశీలించి పుస్తకంలో నోట్ చేసుకుని పోలీసులకు తెలియచేసి మర్నాడు కోర్టుకెళ్ళి విట్‌నెస్ యివ్వాలి. ప్రతీ సీయంవో పట్నంలో కనీసం రోజుకో సారి అయినా కోర్టుకు వెళ్ళవలసిన అవసరం ఉంటుంది.

అతను సర్జికల్ వార్డులో ఉన్నప్పుడు కనీసం ఆపరేషన్లు చేయకపోయినా చూసేందుకయినా వీలుండేది. ఇక్కడ అసలు ఆపరేషన్ అంటూ ఎలాఉంటుందో చూసే ఛాన్సు కూడా ఉండదు. సర్జన్‌ని తీసికెళ్ళి కాఘువాలిటీలో పోస్టు చేయడమంత ఘోరం మరింకేం ఉండదు. ఇక్కడ ఎంతసేపూ పాయిజన్ తిన్నవాడికి స్టమక్ వాషులూ, చర్మం చిట్లిపోతే కుట్లు వేయడం, మెడికో లీగల్ కేసు రిజిస్టరులో పోలీసు కేసులు

ఎక్కించడం — యిదే ఆ నాలుగు గోడల ప్రపంచం.

అక్కడ తీరుబడీఅంటూ అసలుఉండదు. పోస్టుమార్టము అయింతరువాత అన్నీ ఎమర్జన్సీలూ మొదట కాఘువాలిటీకే వస్తాయి. వాటిని పరీక్షచేసి వాటికి సంబంధించిన డాక్టర్ని పిలవాలి.

శేఖర్ డ్యూటీలో ఉన్నాడని తెలిసిన సర్జికల్ వార్డు అసిస్టెంట్లు అతనితో 'డాక్టర్ మీరే పరీక్షచేసి కావలసిన ట్రీట్‌మెంట్‌రాసి వార్డుకి పంపించేయండి. మీరు చూసినతరువాత మేం ఏం చూడాలి. అసలు మీలా చూడగలమా' అనేవాళ్ళు. అంటే యిదో అదనపు పని అన్నమాట.

టీచింగ్ అంటే ప్రాణం ఉన్న శేఖరికి టీచింగ్ అసలు లేకుండా పోయింది. వార్డుకి అటాచ్‌మెంట్ ఉంటేగాని టీచింగ్ ఛాన్సు ఉండదు.

పదిరోజుల్లోనే మనిషి తన్నుతాను ఎంతో కోల్పోయేడు.

ఇలా తనకు ఎందుకు జరుగుతూంది? తను డబ్బు అంటూ ఆశించలేదు. జీవితంలో మనస్సు తృప్తిగా పనిచేసే అవకాశమే కావాలనుకున్నాడు. అంతే. అది కూడా దొరకడం లేదు. పని న్యాయంగా చేద్దాం అనుకొనే వాళ్ళను యీ సంఘం యిలా తరిమి తరిమి కొడుతుందా!!

తను యిక్కడేగాని యింకో రెండు నెలలు ఉంటే పిచ్చివాడు అయిపోతాడు. ఏం చేయాలి? తను మూవర్ యం. యస్‌కి








# నర్సింగ్ హోం

ఉన్నవి అమ్మేసి, అప్పు తీర్చుకొని వెళ్ళిపోవా లన్నా యింకా, ఆరునెలలు ఉంది. అర్థాంతరంగా మధ్యలో చేర్చుకోరు కోర్సులో.

పగలూ రాత్రీ యిదే అతన్ని వేధించే ప్రశ్న ?

తను ఎవరితోనన్నా తన్ను అర్థంచేసుకునే మనిషితో చెప్పుకోవాలి తన బాధను. తన్ను అర్థంచేసుకుని వోదార్చే మనిషి ఎవరు ? నేను ఉన్నాను, ఫర్వాలేదు శేఖర్ నీకు అండగా నిలుస్తాను అని చెప్పే మనిషి ఎవరు ? ఎవరు ? ? ఎవరు ? ? ?

ఆలోచిస్తూన్న కొద్దీ అతనిలో అలాంటి వ్యక్తి రూపం మెదలసాగింది.

తప్పదు అనుకుంటూ ఫోను దగ్గరికి నడిచేడు ఆ వ్యక్తికి డయల్ చేసేందుకు

*　　　*　　　*

మర్నాడుకల్లా నర్సింగ్‌హోం స్టాఫ్ అందరికీ తెలిసిపోయింది డాక్టర్ రాజా నర్సింగ్‌హోం చార్జి తీసుకున్నాడనీ! దాని బాగోగులన్నీ అతనే చూస్తాడనీ! అతనిమాట డాక్టర్ విశ్వం ఆజ్ఞగా తీసుకోవాలనీ!

అసలు వార్డుబాయిలందరూ కాకీ డ్రస్సులో ఉండాలనీ, నర్సులు తెల్ల డ్రస్సులో ఉండాలనీ విశ్వం మొదట్లో ఆంక్ష పెట్టేరు. అది రానురాను ఎవరూ పట్టించుకోకుండా అందరూ తమ తను తోచిన డ్రస్‌లో రాసాగేరు, వొక్క థియేటర్ నర్సు తప్ప. వార్డుబాయిల్లో సీను ఎప్పుడూ ట్రిమ్‌గా ఉంటాడు. అతడు బొగ్గురంగులో వున్నా— అతని బట్టలు నలగకుండా, అప్పుడే ఇస్త్రీ చేసినట్టు ఉంటాయి. అవి చాలా ఖరీదు కూడా. అతని మాట కొంచెం కరుకు. అతను పనిమిదిదాకే చదివేడు. ఎక్కడా పని దొరకక యిక్కడ చేరేడు. అతనికి యిప్పుడు రెండు ఆటోలున్నాయనీ, ఇన్‌స్టాల్‌మెంట్ మీద ఇచ్చే బట్టల బిజినెస్ ఉందనీ అంటూంటారు. అతనంటే అక్కడ స్టాఫ్‌కి హడల్.

అతను పేషంట్లతోనూ, నర్సులతోనూ, చాలా వెకిలిగా మాట్లాడుతాడు.

రాజా యిన్ని రోజులనించీ నర్సింగ్‌హోంకి వస్తున్నా ఏ రెండుసార్లో అతనికి సీను తటస్థపడ్డాడు. రాజా అంతగా పట్టించుకో లేదు. నర్సింగ్‌హోం చార్జి తీసుకున్న రెండో రోజు ప్రొద్దునే రాజా నర్సింగ్‌హోంరవుండ్స్‌కని బయలుదేరేడు. విన్న కనిపించినామె ఫోను దగ్గర కనిపించింది. ఆమెను దాటిపోతూ 'అమ్మా తొందరగా కానీండి' అన్నాడు.

చిటపటలాడుతూన్న ముఖంతో 'సరే' అని తిరిగి మాట్లాడుకోసాగింది ఆమె.

రాజా వరండా దాటి లోనికి వెళ్ళాడు. వరండాకి ఎదురుగుండా ఉన్న బాత్‌రూమ్స్ ముందున్న యిద్దరితో 'ఎవరు మీరు?' అంటూ అడిగేడు.

'మేం అండీ... డాక్టరు విశ్వంగారిదగ్గరికి వచ్చేం.'

'ఇది వోపీవాళ్ళ బాత్‌రూమ్ కాదు. మీరు అక్కడే వున్న బాత్‌రూం వాడుకోవాలి' అని వాళ్ళని పంపించేసి నర్సుని పిలిచి 'దీనికి తాళం వేయించేయండి. ఎవరు అడిగినా నా పర్మిషను లేకుండా యివ్వొద్దు' అంటూ అని 'మీరు రేపటినించీ ఈూ రంగు చీరల్లో కాకుండా తెల్ల డ్రస్‌లో రావలసి ఉంటుంది.' ఆమె తల ఊపింది.

'మిగిలిన వాళ్ళందరితో కూడా చెప్పండి' అని లోపలికి నడిచేడు. ప్రతీ గదిలో ముగ్గురో నలుగురో అటెండెంట్లు. వాళ్ళు కుర్చీల్లో కాకుండా శుభ్రంగా పేషంట్ల మంచంమీదే కూర్చొని ఉన్నారు.

(ఇంకా వుంది)

# " ? "

దేశం
సాధించింది
ఎంతో
ప్రగతి.
కానీ,
చూస్తున్నదా
బీదవాని
గతి ?

— కొంపల్లి ఈశ్వరరావు

# వారఫలం

## 21–8–1981 శుక్రవారం మొదలు 27–8–1981 గురువారం వరకు

మేషం: వ్యాపార రంగంలో, వ్యవసాయ రంగంలో, ఎన్నోమార్పులు చేసారు గా! ఇంకా చేయవలసిన అవసరం ఈ వారం ఏర్పడనున్నది. అప్పులు వసూలు కాగలవు. ఆదాయంగలదు. ఉద్యోగమార్పులు, వృత్తిలో అనుకూలత ఎదురు చూడవచ్చు. స్త్రీలకు: నూతనోద్యోగ ప్రాప్తి, మనో వాంఛాసిద్ధి గలవారం.

వృషభం: అనుకూల మార్పులు, మీ దైనందిన కార్యాలందు రానున్నవి. మీకు సాహిత్య కళారంగాలలో అవకాశం ఏర్పడగలదు. అయినవారి సంబంధం నిశ్చయం చేసికోవాలనే వాంఛ ప్రగాఢంగా నెలకొనే వారం. శుభ కార్య ప్రస్తావనలుండగలవు. చేసిన కార్యమే మరలా చేయవలసిన అవకాశం ఏర్పడే మార్గమున్నది. స్త్రీలకు: సర్వత్రా అనుకూలత గల వారం.

మిథునం: ప్రతిష్ఠ అతిశయించే కార్యమేదో చేపట్టనున్నారు. క్రింది వారిని అజమాయిషీ చేయవలసిన పరిస్థితులు మీ భారీ వ్యాపారంలో ఏర్పడగలవు. ప్రత్యక్షంగా మీకు అపకారం జరుగదు గాని మీపై అభాండాలు వేసేవారు కూడలేక పోలేదు. స్త్రీలకు: కొత్తగా ఉద్యోగవృత్తులందు చేసే ప్రయత్నాలు ఫలించనున్నవి.

కర్కాటకం: అమాయకమైన మీ ప్రకృతికి పరీక్షా సమయం. చేతికి చిక్కిన అవకాశాలు హఠాత్తుగా జారి పోయే అవకాశం కూడా లేకపోలేదు. బంధు విరోధం కలిగే మార్గం కూడా సంభవం. స్త్రీలకు: విదేశయానమో, దూర ప్రాంతాలు పర్యటించుటో, ఉద్యోగరీత్యాగాని విద్యార్జననిమిత్తంగాని సంభవమే.

సింహం: మీ మాటకు విలువ పెరుగుతుంది. వ్యాపార రంగంలో మీ అభిమానులు సహాయం చేయనున్నారు. మీరు భారీవ్యాపారం చేసేవారైతే, క్రయ విక్రయాలందు అనుకూలత చేకూరవచ్చు. అధికారుల ఆదరణమీకు లభించే అవకాశమున్నది. స్త్రీలకు: రచనా వ్యాసంగం ఫలించటం, వైద్యవృత్తి అయితే భాసించటం, ప్రతిభ రాణించే అవకాశం ఏర్పడటం, వార విశేషం.

కన్య: దూర బంధు దర్శనం, మిత్రులను కలిసి కొని సంభాషించటం, పత్రికా ప్రకటన కర్తలైతే, అవకాశాలు లభించటం, వృత్తి ప్రకాశించే అవకాశాలు ఏర్పడటం గమనించగలరు. శక్తి వంచనలేక, అన్ని రంగాలలో ప్రయత్నించటం న్యాయం. స్త్రీలకు: వారం చివరి మూడు రోజులలో, నూతన వస్తుసేకరణ, నూతన విషయాలు తెలిసి కోవటం జరిగే మార్గమున్నది. గ్రహస్థితియు అట్టిదే.

తుల: సొంత వ్యవహారాలను దూరంగా పెట్టి పరుల వ్యవహారాలకై ప్రాకులాడుతారు. కాల హరణం చేయ బోతారు. ఇందులకు తోడు అధికంగా ధనం వ్యయం చేయనున్నారు కూడ. స్థిర చరాస్తులందు, శ్రద్ధాసక్తులవసరమని గ్రహించాలి. ఎలాగైనా లబ్ధిగల వారమే. స్త్రీలకు: సుఖశాంతులు, ఆదాయం గల వారం.

వృశ్చికం: వ్యాపారం యథాతథంగా సాగి పోతుంది. దైవకార్యాలు నెరవేరుటకు ఆక్షేపణలేదు. నలుగురులో పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనే, పనులందు జోక్యం కలుగజేసికొంటారు. వస్తువులు సేకరించు కొంటారు. స్త్రీలకు: అధిక విద్యార్జనకు ప్రాకులాడువారికి, దూర దేశ ప్రయాణం తల పెట్టిన వారికీ అనుకూల దినాలనే గ్రహించాలి.

ధనుస్సు: ఒక్కొక్క వ్యవహారం చక్కబెట్టుకొని ముందుకు పోతుంటే, ఒక్కొక్క వ్యవహారంలో వెనుకకు రావలసిన విషయం తప్పక పోతుంది. స్నేహితులతో ఎంత సామరస్యంగా ఉంటే, అంతమేలు చేకూరుతుంది. స్త్రీలకు: నూతన విషయాలు తెలిసికొనుట, నూతన వ్యవహారాలలో ఆదాయం సంపాదించుట గ్రహింపగలరు.

మకరం: ఆలోచించి, మీరు గావించే ప్రతి విషయంలోనూ మీరు విజయం సాధించనున్నారు. వ్యాపారవృత్తులందు ఆదాయం గడించనున్నారు. అయిన వారితోనో, స్త్రీలతోనో, వాగ్వాదం సంభవించే అవకాశమున్నది. జాగరూకత వహించటం ఎంతైనామేలు. స్త్రీలకు: ప్రయాణానుకూలత, యత్నా కార్యసిద్ధి, కించిత్తు ఆదాయం లభించగల దినాలే.

కుంభం: వస్తువులు ఏవో కొనుగోలు చేయనున్నారు. కొందరు వ్యవసాయరంగాన అభివృద్ధి కరమైన మార్పులు గావించనున్నారు. కృషితో నాస్తి దుర్భిక్షమ్, మీ కృషియే మీకు లాభసంపాదనకు కారకం. స్త్రీలకు: వయసులో ఉన్నవారికి కార్యానుకూలత, ఉద్యోగంలో అభివృద్ధి చేకూరే వారం.

మీనం: చాలమంది విషయంలో ప్రయాణం చెప్పదగిన వారం. వ్యాపార విషయంగా ప్రయాణం సాగించితే లాభదాయకమే. క్రీడావనిలో చాలమందికి అవకాశాలు లభించనున్నవి. కళా సాహిత్య రంగానుభవం గలవారికి, కంట్రాక్టరులకు సదవకాశాలున్నాయి. స్త్రీలకు: సంగీత ప్రియులకు, రచనా వ్యాసంగంలో పరిచితులకు లాభించే మార్గమున్నది.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి...***
***కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో***
***దంతక్షయాన్ని ఎదుర్కోండి!***




DC.G.74 TL

# ఎదురుచూపు

కొండముది రుక్మిణీదేవి

**పెద్ద కథ**

## 8

**(గత పంచిక తరువాయి)**

**మో**హన్ మనస్సు అల్లకల్లోలంగా వుంది.

"మాధవి వెళ్ళింది ? ఎందుకు వెళ్ళింది ? ఎలా బ్రతుకుతున్నది ? ఒంటరి ఆడదాన్ని, అందులోనూ, అమాయకురాల్ని బ్రతకనిస్తుందా లోకం? అసలు బ్రతికుందా ? వెళ్ళేటప్పుడు తనతో ఒక్కమాట చెప్పకూడదూ ! తనకు తెలిస్తే అసలు వెళ్ళనిచ్చేవాడా ?"

మాధవి వెళ్ళిన తరువాత రెండు రోజులకు తల్లినడిగితే చెప్పింది – "వాళ్ళ వూరు వెళ్తొస్తానని వెళ్ళింద"ని. వెంటనే వచ్చేస్తుందని రెండు రోజులు చూశాడు. వుండబట్టలేక ఆ పల్లెకు వెళ్ళాడు. కారు దిగి నలుగురికీ కనపడే ధైర్యంలేక కొబ్బరి తోపులోనుంచి దూరంగా కనబడుతున్న ఆ ఇంటికేసి చూశాడు. మనిషి మసలుతున్న జాడలు ఎక్కడా లేవు. మట్టిగోడలు పెళ్ళలూడి శిథిలావస్థలో వున్నాయి. సాలీళ్ళు గూళ్ళుకట్టాయి చూర్లనిండా. ఎండిపోయిన ఆకులోత్తునిండి వుంది వాకిలంతా ! పూలమొక్కల స్థానంలో పిచ్చి మొక్కలు మొలిచినాయ్ ! పశువుల నివాసంలో కట్టుకొయ్యలు మిగిలివున్నై, గత చరిత్రకు చిహ్నాలుగా ! మనిషి కనపడకుండా రంగుటద్దాలు పైకితీసి, కారు స్టార్ట్ చేశాడు, తనొచ్చినట్లు తెలిస్తే వూరి జనం పోగవుతారని.

వారాలు, నెలలు గడుస్తున్నాయ్ కాని మాధవి జాడలేదు. ఇదే అదను అన్నట్లు సుశీలమ్మ, సీతారామయ్య తాము కుదిర్చిన పిల్లను పెళ్ళి చేసుకోమని ఒత్తిడి చెయ్యటం మొదలుపెట్టారు, మోహన్ని. కాలేజీ చదువు పూర్తయింది. ఇంట్లో వున్న కొడుక్కి ఎంతగానో చెబుతున్నది సుశీలమ్మ.

"ఆ అమ్మాయికి, మనకు ఎక్కడ సాపత్యం. ఏదో ఆవేశంలో చేసుకున్నావు. మేమూ కాదనలేక భరించాం ! ఏం చేసిందో చూడు ! నీచపు మనుషులు, నీచపు బుద్ధులు ! నీ పక్కన ఆ పిల్లను తల్చుకోటానికే అసహ్యంగా వుంది. మన అంతస్తు... కయ్యము, వియ్యము, నెయ్యము సరిసమానుల్తో చెయ్యమని వూరికే అనలేదు పెద్దవాళ్ళు. మేము చెప్పిందే కాదు. మన స్థాయికి తగిన పిల్లను నువ్వే చూసుకో ! మేము కాదనం" అంటూ పోరటం మొదలు పెట్టింది.

"ఆ ఉద్దేశ్యం లేదని ఎన్నిసార్లు చెప్పాను. భార్య బ్రతికుండగానే మళ్ళీ పెళ్ళి చేసుకోనా !"

"బ్రతికిందో ... చచ్చిందో...లేకపోతే రెండు రోజుల్లో వస్తానని వెళ్ళిన మనిషి తిరిగి రాలేదంటే, అక్కడే ఎవర్నన్నా ... "

"అమ్మా ! నీకు తోచినట్లు మాట్లాడకు" విసుగ్గా అన్నాడు.

"మాట్లాడక ఏం చెయ్యం. అవతల పెద్ద మనుషుల్తో పని. ఆడపిల్లగలవాళ్ళు వాళ్ళ తొందర వాళ్ళది" అప్పుడే అక్కడకు వచ్చిన సీతారామయ్య అన్నాడు.

"పెద్దమనుషులయినా, చిన్నమనుషులయినా నాకు అనవసరం. నాకు ఆ ఉద్దేశ్యం లేదని ఎన్నిసార్లు చెప్పాను." కాస్త విసుగ్గా అన్నాడు మోహన్ మళ్ళీ.

"జీవితాంతం దానికోసమే ఎదురుచూస్తావా ? వయసయిపోయిన తరువాత ఎవరిస్తారు పిల్లను ?" సీతారామయ్య అన్నాడు.

"ఈ వంశానికి నువ్వొక్కడివి. నీకు పెళ్ళీ పేరంటం చేసి, అచ్చట ముచ్చట తీర్చుకుందా మనుకున్నాను. ఆడపిల్లల్లేరు. కోడలయినా నట్టింట తిరుగుతుందని ఆశపడ్డాను." కళ్ళనీళ్ళు పెట్టుకున్నది సుశీలమ్మ.

ఇహ అక్కడ వుండలేనట్లు బయటకు వెళ్ళిపోయాడు మోహన్. అతనీమధ్య ఇల్లు కదలటం లేదు. స్నేహితుల దగ్గరకు వెళ్ళటంలేదు. సినిమాలకు అసలే వెళ్ళటం మానేశాడు. తింటున్నా, పడుకున్నా మాధవి ధ్యాసే ! ఆ మనసంలో తన బట్టల గురించికానీ, తన అవసరాల గురించికానీ గుర్తు రావటంలేదు. ఎక్కడికి వెళ్ళాలి ? అని ఆలోచించుకోకుండానే, పార్కులోకి వెళ్ళి ఓ మూలగా బెంచిమీద కూర్చున్నాడు. ఆ వేళ ఆదివారం కావటంతో, పార్కు అంతా జనంతో నిండివుంది. జట్లు జట్లుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు. ఇంతలో ఎక్కడనుంచి వచ్చారో ఓ అయిదారుగురు అమ్మాయిలు వచ్చి మోహన్‌కి కాస్త దూరంలో పచ్చికలో కూర్చున్నారు. అందులో స్మిత కూడా వుంది. ఖరీదయిన చీరలో, వాజాకైన నగలతో, ఆడంబరంలేని అలంకరణతో, అప్సరసలా వెలిగిపోతున్నది. అస్తమిస్తున్న సూర్యకిరణాలు ఆమె చెంపల్ని తాకుతుంటే, పచ్చని చెక్కిళ్ళు అరుణిమ దాలుస్తున్నయ్ !

మోహన్ని చూస్తూనే, "గుర్తున్నానా ?" అన్నది గర్వంగా.

జవాబు చెప్పలేదు మోహన్.

"ఆడపిల్లలా సిగ్గుపడుతున్నావేమిటి ?" చిలిపిగా అన్నది మళ్ళీ.

ఈసారీ మౌనం దాల్చాడు మోహన్. అయినా ఆమె ఊరుకోలేదు.

"అవునూ ! ఆ మధ్య ఏదో ఉపన్యాసం దంచినట్లున్నావు. నీ కలల రాణి ఇంకా కనపడలేదా?"

"కలల రాణి ఏమిటి ?" ఆత్రుతగా అడిగారు స్మిత స్నేహితురాళ్ళు.

"దానికో కథ వుంది, తర్వాత చెబుతాలే !" అని, "ఆదర్శాలకు పోయి అవస్థలపాలుకాకు. అది ఉపన్యాసం, ఇది జీవితం. ఇప్పటికే "దేవదాసు" పోలికలు కనబడుతున్నై నీలో" అల్లరిగా అంది.

మోహన్ అక్కడ నుంచి లేవబోయాడు.

"నా పెళ్ళి కుదిరింది. డబ్బున్నవాణ్ణే చేసుకుంటున్నాలే ! తొందరలోనే ఇన్విటేషను వస్తుంది తప్పకుండా రా !" గర్వంగా అన్నది స్మిత.

ఆమె ప్రయోగిస్తున్న ఏకవచనం అతడికి అసహ్యం కలిగిస్తున్నది. "ఏమంత చనువుందని అంత ఆంతరంగికంగా మాట్లాడుతోంది ?" ఆమె అన్న ఒక్క మాటకు జవాబు చెప్పకుండానే అక్కడి నుంచి వచ్చేశాడు మోహన్.

"పాపం ! ఆవేశపరుడు. ఏదో మనోవేదనతో నలిగిపోతున్నాడు" జాలిగా అన్నది స్మిత.

"అతడ్ని గురించి అంతగా ఆలోచిస్తున్నావు. ఏదన్నా వ్యవహారం జరిగిందా ఏం ?" అని అడిగారు స్మిత చుట్టూవున్నవాళ్ళు.

"అబ్బే ! మా ఇద్దరికీ చుక్కెదురు" తేలిగ్గా అన్నది.

మోహన్ ఇంటికి వచ్చేసరికి చేతిలో ఉత్తరం పెట్టుకుని చిందులు తొక్కుతున్నాడు సీతారామయ్య. అది మధ్యవర్తి రాసిన ఉత్తరం. "ఏదో తెలిసిన వాళ్ళని మీ సంబంధం చెప్పాను. మీరు పెట్టిన షరతులన్నిటికీ వాళ్ళు ఒప్పుకున్నా ఎన్నాళ్ళికీ పిల్లను చూసుకోను రాకపోయేసరికి వాళ్ళు వేరే సంబంధం చూసుకున్నారు" అని రాశాడు. దాంతో ఆయన ప్రాణంతా పోయినట్లయింది. తమకూ ఆస్తి వుందిగాని అంతలేదు. దాదాపు కోటి రూపాయల ఆస్తికి వారసురాలు. 'సిరిరా మోకాలొడ్డిన' అంటే ఇదే

---

**జరిగిన కథ–2 :** కాలేజీ ఆడిటోరియంలో జరిగిన నక్షత్రాల పోటీలో మొదటి బహుమతి మోహన్, రెండవ బహుమతి స్మిత గెల్చుకొంటారు. తన కారు క్రిందపడి మరణించిన సుబ్బయ్య కూతురు మాధవిని ఆ వూరి పెద్దల ప్రోద్బలంతో పెళ్ళి చేసుకుని, ఇంటికి తీసుకు వచ్చిన మోహన్‌ను సాదరంగా ఆహ్వానిస్తారు అతని తల్లిదండ్రులు సుశీలమ్మ, సీతారామయ్య. కానీ ఆ పెళ్ళి వారిద్దరికీ ఇష్టంలేదు. మాధవిని మోహన్‌కి దూరంగా వుంచుతారు. మోహన్ అభిప్రాయం తెలుసుకోకుండా ఓ సంబంధం నిశ్చయం చేస్తారు సీతారామయ్య దంపతులు. అది తెల్సుకున్న మాధవి ఆ ఇంట్లోంచి వెళ్ళిపోతుంది. బస్సులో ఓ సంఘటన ద్వారా మాధవి మంచితనాన్ని గుర్తించిన విశ్వనాథంగారు ఆమెను తమ ఇంటికి తీసుకుపోతారు. వాళ్ళింట్లో పన్లు చేస్తూ సీతమ్మ, విశ్వనాథం దంపతులకు, వాళ్ళ కూతురు భార్గవికి ఆప్తురాలవుతుంది.

---

కాబోలు అనుకుని, అటు భార్యమీద, ఇటు కొడుకు మీద విరుచుకుపడుతున్నాడు.

"ఎంతగా చెప్పినా వాడు వినందే నేనేం చెయ్యను ?" సాగదీసింది సుశీలమ్మ.

"ఎందుకు వింటాడూ మన మాట ? ఈ ఇంటి పరువు, మర్యాద వాడికక్కర్లేదు. వాడు వెంటేసుకొచ్చిన ఆ ముష్టిముండ..."

"నాన్నా!" గర్జించాడు అప్పుడే అక్కడకు వచ్చిన మోహన్.

"ఏమిట్రా ! నీ అరుపులు ? నన్నే ఎదిరిస్తున్నావా ? అమాయకుడ్ని చేసి మెళ్ళో తాళి గట్టించుకున్నది. ఇక్కడికి వచ్చిన తరువాత దాని పప్పులేం వుడక్క, మరొకడితో పోయింది. ఏం కాదంటావా?" మొహం గంటు పెట్టుకుంటూ అన్నాడు సీతారామయ్య.

"ఏం మందు పెట్టిందో ఏమో! ఏ సంబంధమూ లేకుండానే, దానికోసం ఇంతగా పాకులాడుతున్నాడు. కలిసి కాపురం వెలగబెట్టినట్లయితే, మన సంగతే మర్చిపోయేవాడు." విట్టూరుస్తూ అన్నది సుశీలమ్మ.

"మాధవి అమాయకురాలు! ఎక్కడికి వెళ్ళి ఎన్ని అవస్థలు పడుతున్నదో ?" మోహన్ గొంతులో జాలి ధ్వనించింది. ఆ జాలి తల్లిదండ్రుల్లో కసి పెంచింది. కొడుకు మళ్ళా పెళ్ళి చేసుకోడేమోనన్న భయం కలిగింది. "ఈనాటి యువకుల్లో ఇంత పట్టుదల, స్త్రీలమీద గౌరవం వున్నాయా" అని ఆశ్చర్యం వేసింది.

మోహన్ తన గదిలోకి వెళ్ళి, తలుపు వేసుకున్నాడు. బట్టలు మార్చుకుని, బాత్‌రూంలోకి వెళ్ళి స్నానం చేసివచ్చి లాల్చీ, పైజమా వేసుకుని, బాల్కనీలోకి వచ్చాడు. కుండల్లో వేసిన క్రోటను, గులాబి, చామంతి మొక్కలు నీళ్ళులేక వాడిపోయి, ఎండిపోవటానికి సిద్ధంగా వున్నాయి. ఆకాశంలో చంద్రుడు క్షీణదశకు అతిచేరువగా వున్నాడు. అప్పటిదాకా వూగిసలాడిన చెట్లు వున్నట్లుండి స్ట్రైక్ మొదలుపెట్టాయి. మోహను మనసు మాధవిని గూర్చిన ఆలోచనలతో నిండిపోయింది. "తనవల్ల ఆమెకు అన్నీ అనర్థాలే జరిగాయి. పల్లెటూళ్ళో పుట్టి పెరిగిన మాధవి, అక్కడకు వెళ్ళలేదంటే ఆమె ఆత్మాభిమానం ఎంతగా దెబ్బ తిన్నదో ... ఎక్కడ మోసపోయి, ఎన్ని కిరాతకాలకు లోనయిందో ... ! తనేం చెయ్యగలడు ? ఎక్కడని వెతగ్గలడు ? ఎలా ఆమెను చేరుకోగలడు ? ఆ రోజు ఆ పసుపుతాడు తను కట్టకపోయినట్లయితే ఆమె జీవితం మరొక రకంగా వుండేది. ఆమెకు తనేం చేశాడు ? ఆవేశంలో వల్లించిన ఆశయాలు ఆచరణలో పెట్టలేకపోయాడు. ఓడిపోయాను స్మితా! ఓడిపోయాను" అంటూ తల పట్టుకున్నాడు.

"వంటరిగా కూర్చుని ఏం చేస్తున్నావురా ? అన్నానికి రా ?" అంటూ వచ్చింది సుశీలమ్మ.

"నాకు ఆకలిలేదు. మీరు తినండి" అన్నాడు మోహన్.

"కనీ, పెంచి, పెద్దచేసిన మా కన్నా అది ఎక్కువైందిరా నీకు ! ఎప్పుడన్నా మీ నాన్న నువ్వు తినకుండా అన్నం తిన్నారా ? నీకు జ్వరం వచ్చి, లంఖణాలు చేస్తే నీతోపాటు ఆయనా పస్తులుండి తాగి వుండేవారు. నువ్వు ట్యూషన్లకి వెళ్ళి పది గంటలు దాటిన తరువాత ఇంటికి వస్తే అప్పటిదాకా నీ కోసం కాచుకుని కూర్చునేవారు. అవన్నీ అప్పుడే మర్చిపోయావా ?" అంటూ కళ్ళు వత్తుకున్నది సుశీలమ్మ.

"అమ్మా ! మాధవి గురించి నా కన్నా నీకే బాగా తెలుసు. ఆమె ఎందుకు వెళ్ళిపోయింది ? ఎక్కడికి వెళ్ళిపోయింది ? ఆమె వుండగానే నాకు తెలీకుండా, నాకు పెళ్ళి సంబంధాలు చూడ్డం మొదలుపెట్టారు గదూ ? ఏ ఆడది భర్త తన కళ్ళ ముందే మళ్ళీ పెళ్ళి చేసుకుంటుంటే చూస్తూ వూరుకోగలదు ? అమ్మా! మనకు డబ్బుంది. సంఘంలో గౌరవం వుంది — పలుకుబడి వుంది. కానీ ... కానీ...మాధవికి మంచి మనస్సున్నదమ్మా! ఆ మనసుని అర్థం చేసుకోగలిగే వివేకమే మనకు లేదు."

"మాధవిని ఇంతగా ఆరాధిస్తున్నావని, ఆమె కోసం ఇంతగా తపిస్తావని అనుకోలేదు మోహన్ ! మీ ఇద్దరికీ అడ్డుగా నిల్చింది నేను. నువ్వన్నట్లు



ఆమెకు తెలిసేట్లుగానే రెండు మూడు సంబంధాలు చూసిన మాట నిజమే! మాధవి వెళ్ళిపోవటానికి నేనే కారణం. తోటి ఆడదాని మనసు గ్రహించలేకపోయాను. కన్నబిడ్డ సుఖశాంతులకే దోహదం చెయ్యలేకపోయాను. ఆయన చెప్పినట్లు విని అమాయకురాలైన మాధవికి అన్యాయమే చేశాను. భగవంతుడా! నా బిడ్డ మనసు మార్చు! లేకపోతే మాధవిని మా ఇంటికి చేర్చు'' మనసులో అనుకుని అక్కడి నుంచి మౌనంగా వెళ్ళిపోయింది సుశీలమ్మ.

## 9

పోస్టుమాను ఇచ్చి వెళ్ళిన ఉత్తరం చదివి, భార్యను కేకవేశాడు సీతారామయ్య.

''పూజ చేసుకుంటున్నాను. ఇలా వచ్చి చెప్పండి సంగతేమిటో?'' వంట ఇంట్లో నుంచే అన్నది సుశీలమ్మ.

ఉత్తరం చేతబట్టుకుని వెళ్ళి, ''మన సూర్యానికి మగపిల్లవాట్ట'' అన్నాడు సంతోషంగా.

దేవుడి ముందు కూర్చున్న సుశీలమ్మ మనసులో క్షణం అసూయ తొంగి చూసింది. మరు క్షణం మనసు కుదుట పరుచుకుని, ''చెయ్యరాని నేరం ఏం చేశాము స్వామీ? నట్టింట పసిబిడ్డ పారాడే యోగ్యతలేదా?'' అనుకున్నది. ఆ రోజంతా ఆమె మనసు స్థిమితం కోల్పోయింది.

సూర్యం, మోహన్ ఒక వయసువాళ్ళే. రెండేళ్ళ క్రితమే సూర్యానికి పెళ్ళయింది. భార్య మంచి అందగత్తె, ఐశ్వర్యవంతురాలు. చిన్నప్పుడే తల్లీ, తండ్రీ పోయినా — తాత, నాయనమ్మల దగ్గర పెరిగాడు. తల్లి లేకపోయినా, సెలవులకు పెత్తల్లి సుశీలమ్మ దగ్గరకు వచ్చేవాడు, మోహన్‌తో సరదాగా గడపవచ్చని. పెళ్ళయిన తరువాత భార్యను మొదట తమ ఇంటికే తీసుకువచ్చాడు. చదువుకాగానే ఉద్యోగం వచ్చింది. ఉద్యోగంలో చేరిన కొద్ది రోజుల్లోనే పెళ్ళయింది. పెళ్ళయిన రెండేళ్ళు కాకుండానే... తమకేది ఆ అదృష్టం. తల్లీ, తండ్రీ లేకపోవటం సూర్యం దురదృష్టమన్నారంతా. కానీ ... తాముండీ మోహన్‌కి ఏం చెయ్యగలుగుతున్నారు?

ఇలా రకరకాలుగా ఆలోచిస్తోంది ఆమె.

''అమ్మా! మా ఫ్రెండు పెళ్ళికి వెళ్తున్నాను సాయంకాలం'' అన్నం తింటూ చెప్పాడు మోహన్.

''తప్పకుండా వెళ్ళిరా! అదిసరే మోహన్. మీ ఫ్రెండ్స్ అందరి పెళ్ళిళ్ళకు నువ్వు వెళ్తావు గదా? వాళ్ళను నువ్వు పిలవొద్దూ?''

''ఆ మాట ఎత్తొద్దన్నానా?'' కోపంగా తల్లివైపు చూశాడు.

''నీ ఇష్టం. పెద్దవాళ్ళం బ్రతికున్నాం గనక...'' కళ్ళొత్తుకున్నది.

''అమ్మా! నీకు వేరే ఆలోచన రాదా?'' కోపంగా అన్నాడు.

కొడుకులో వస్తున్న మార్పు, అయినదానికి కానిదానికి కోపం తెచ్చుకోవటం, సుశీలమ్మను ఆందోళన పరచినయ్. తనంటే ఎంతో గౌరవం ఇచ్చే కొడుకు తనకు దూరమైపోతున్నాడనిపించి భయం కలిగింది.

''తలుపులన్నీ తీసిపెట్టి ఈ వంట ఇంట్లో

# ఎదురు చూపు

ఏం చేస్తున్నావ్?'' అంటూ వచ్చాడు సీతారామయ్య.

యాంత్రికంగా లేచి భర్తకు అన్నం పెట్టి, ఆయన తింటుంటే ఎదురుగా కూర్చుని, ''ఏమండీ! మనవల్లనే కదూ మాధవి ఈ ఇంటినుంచి వెళ్ళిపోయింది?'' అన్నది.

ఆ మాటతో ఉలిక్కిపడ్డాడు సీతారామయ్య. తనను తాను సంబాళించుకుని, ''ఆ అమ్మాయిని గురించి ఇంకా నువ్వా ఆలోచిస్తున్నావా?'' తీక్షణంగా భార్యవైపు చూస్తూ అన్నాడు.

''నా సంగతెలావున్నా వాణ్ణి చూస్తుంటే నా కడుపు చెరువవుతున్నది. పెళ్ళి విషయంలో మన మాట వినేలాలేడు.''

''వినకేం చేస్తాడు. నా స్నేహితుడు రామగోపాలం లేడూ, వ్యాపారం పనిమీద ఈ వూరొస్తున్నాట్ట. వాడికి ఒక్కత్తే కూతురు. బాగా సంపాయించాడు. ఆ కూతురికేదైనా మంచి

## సూయిసైడ్

జీవితం దుర్భరమై
జీవనం దుర్లభమై
మనోవల్మీకం
చెదలు పట్టి
హృదయ ఫలకం
పగుళ్ళు విచ్చి
బ్రతుకు భారమై
నిర్లిప్తత నిత్యమై
గత్యంతరం వ్యగ్యమై
మరో జన్మకు (ఉంటే!)
లైఫ్ రిజిష్టర్
చేసుకొనేదే 'సూయిసైడ్'!

— రుద్రమూర్తి

సంబంధం వుంటే చూడమని రాశాడు. పిల్లను కూడా తీసుకురా? ఇక్కడ కొన్ని సంబంధాలున్నై అని రాస్తున్నాను'' అన్నాడు సీతారామయ్య.

''మన సంగతి మనకు లేదుగానీ ఊరికి ఉపకారం. మనబ్బాయి సంగతి నేను చెబుతుంటే ఎవరో పిల్ల గురించి మీరు చెబుతారేమిటి?'' విసుక్కున్నది సుశీలమ్మ.

''ఆ అమ్మాయిని రానీ, అన్నీ అవే సర్దుకుంటాయి'' నర్మగర్భంగా అని చెయ్యి కడుక్కుని వెళ్ళిపోయాడు సీతారామయ్య.

సుశీలమ్మకు అంతా అగమ్యగోచరంగా వుంది. ఆ మధ్య ఒకటి రెండు సంబంధాలు వచ్చినాయ్‌గానీ మళ్ళా ఎవరూ తమ గడపలోకి రాలేదు. మాధవి సంగతి బయటకు పొక్కలేదు కదా! ఈ విషయం లోకానికి తెలిస్తే తమను వంచకులుగా, మోసగాళ్ళుగా భావిస్తారు. పరువూ, మర్యాద మంటగలుస్తాయ్! ఆ అమ్మాయి వచ్చి వెళ్ళినప్పటినుంచి ఈ ఇంటి వాతావరణం స్తబ్దుగా తయారైంది. ఎవరిలోనూ ఉత్సాహంలేదు. వెనకటి సరదాలు, సంతోషం అసలే లేవు. ఎవరిమటుకు వాళ్ళు యాంత్రికంగా రోజులు గడుపుతున్నారు. ఈ యాంత్రిక జీవనం ఒక్కొక్కరిలో ఒక్కొక్క ఆలోచన రేపుతున్నది. అయినా ఏదో ఆశాకిరణం అందరికీ అందుకోలేనంత దూరంలో కనబడుతున్నది.

ఎప్పటికయినా మాధవిని పొందగలననే ధైర్యం, పొందాలన్న ఆశ మోహన్‌దయితే, డబ్బుతో సహా కోడలు ఈ ఇంట్లో అడుగుపెట్టి తీరాలన్నది సీతారామయ్య పట్టుదల. వీళ్ళిద్దరి మధ్య, నలిగిపోతున్నది సుశీలమ్మ. ఆ శుభ సమయం కోసం ఎదురు చూడ్డం తప్ప ఇంకేం చెయ్యగలదు?

## 10

''అందరికీ ఉత్తరాలు రాయండి. బారసాల ఘనంగా చేసుకోవాలి. ఇన్నేళ్ళ తరువాత నట్టింట మగబిడ్డ పుట్టాడు. ఊళ్ళో అందర్నీ భోజనాలకు పిలవాలి. ఆ అన్నట్లు బట్టల కొట్టుకెళ్ళినప్పుడు మాధవికి గూడా మంచి చీర, జాకెట్టు గుడ్డ తీసుకురండి. ఇదంతా ఆ అమ్మాయి చలవే! భార్గవిని ఆస్పత్రికి తీసుకువెళుతుంటే మాధవి ఎదురొచ్చింది. పండంటి బిడ్డనెత్తుకుని, మనబిడ్డ మన ఇంటికొచ్చింది'' అంటూ ఒకటే హడావుడి చేస్తోంది సీతమ్మ. మనవడికి ఏం పేరు పెట్టాలి? ఏ ఏ నగలు చేయించాలి? ఏ పూట ఏ చొక్కా తొడగాలి? ఆవిడకివే ఆలోచనలు.

ఆ పసివాణ్ణి చూస్తుంటే మాధవి మనసు పరుగులు తీసేది. మోహన్, తనూ కలిసి జీవితానందాన్ని పంచుకున్నట్లయితే, తనూ ఈపాటికి ఓ బిడ్డనెత్తుకునేది. పుట్టింట కొద్దిపాటి ఆస్తి వున్నా, మోహన్‌ది చాలా పెద్ద కుటుంబం. ఇక్కడ అమ్మమ్మ మనవణ్ణి చూసి సంబరపడుతుంటే, అక్కడ నాయనమ్మ సంబరపడేది... ఈ ఆలోచన రాగానే, సుశీలమ్మ తనకు చేసిన అన్యాయం గుర్తొచ్చి ''వాళ్ళు మనుషులు కారు, ఆడదాని మనసు తోటి ఆడదే గమనించలేకపోయింది. మోహన్! నీ ఆదర్శాలతో నా గొంతు కోశావు. నా జీవితాన్ని నాశనం చేశావు. నా సుఖాల్ని నట్టేట్లో కలిపావు. నీవు మాత్రం ఏం సుఖపడతావులే! ధైర్యంలేని పిరికిపందవి. సాహసంలేని చవటవి. పెద్దవాళ్ళను కాదనలేని అసమర్థుడివి. పెళ్ళాన్నే ప్రేమించలేని నపుంసకుడివి.'' అని ఆవేశపడేది. కానీ మరుక్షణం, ''నా దురదృష్టమే నన్ను దూరం చేసింది అందరికీ!'' అని మనసు దిటవు చేసుకునేది.

పెళ్ళికి చేసినంత హడావుడి చేస్తున్నారు సీతమ్మ దంపతులు బారసాలకు.

ఒకరోజు విశ్వనాథం బంధువులందరికీ, ఉత్తరాలు రాస్తున్నాడు. ''సీతారామయ్యగారికి రాశారా?'' అన్నది సీతమ్మ.

ఆ మాట విన్న మాధవికి మిన్ను విరిగి మీద పడ్డట్లయింది. ''ఎవరీ సీతారామయ్య! మోహన్ తండ్రి కాదుగదా? ఎందుకు కాకూడదు. బారసాలకు పిల్చేంత దగ్గరి చుట్టాలా? అయితే తప్పకుండా వస్తారు. తనిక్కడచూసి, సీతమ్మగారితో ఏమేమో చెబుతారు. ఇప్పటివరకు ఇంతగా ఆదరించేవాళ్ళు

# ఇదిగో!

## క్రొత్త ప్రెస్టేజ్

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్




## అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన క్రొత్త ప్రెస్టేజ్ మీరుకోన బోయే అతి భద్రమైన ప్రెషర్ కుక్కర్

ఆహార పదార్థములచే వెయిట్ వాల్వ్ మూయబడినచో మీ ప్రెషర్ కుక్కర్‌లో హెచ్చు ఒత్తిడి కలుగును అట్టి సమయమున మీ కుక్కర్ భద్రత సేఫ్టీ ప్లగ్ మీదనే ఆధారపడియుండును మీ ప్లగ్ నకిలీదై వుండవచ్చు మీకు తెలియదు ఎందువలనగా మీరు అసలు సేఫ్టీ ప్లగ్‌ను నకిలీ ప్లగ్‌ను గుర్తించలేరు

అందువలనే, పూర్తి భద్రత మనసులో ఉంచుకొని ఏమాత్రము ప్రమాదము జరగడానికి వీలులేకుండా, ఈ "క్రొత్త ప్రెస్టీజ్" రూపొందించాము దీని అద్వితీయ గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ మీ కుక్కర్ భద్రతను ఎల్లకాలము కాపాడుతు సేఫ్టీ ప్లగ్ అవసరము లేకుండా చేస్తుంది.



### అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా క్రొత్త ప్రెస్టీజ్‌కు నూటికి నూరు పాళ్ళు భద్రత ఎలా సమకూరుతుంది?

సేఫ్టీ ప్లగ్‌ను త్రోసి వేసేంతగా ఒత్తిడి పెరుగకముందే అధిక ఆవిరి గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా ఖచ్చితముగా బయటకు పోవును. నకిలీ లేక పాత "స్పేర్స్" వాడినను, మీ ప్రెషర్ కుక్కర్ పూర్తి భద్రతనిచ్చును ఎల్లవేళలందు



### క్రొత్త ప్రెస్టీజ్ మీకు ఎక్కువ సౌకర్యము నిచ్చును

గేస్కెట్ ఆవిరిని వొదిలిపెట్టగానే మీరు చేయవలసింది దాని స్థానము లోనికి దానిని తొయ్యడము మాత్రమే అప్పుడు మీ కుక్కర్ తిరిగి వాడకానికి కొన్ని క్షణములలో సిద్దము సేఫ్టీ ప్లగ్గే అనవసరము అందువే దానిని మార్చే అవసరములేదు దాని గురించి చింతించనవసరములేదు



### క్రొత్త ప్రెస్టీజ్ ఎంతో మన్నిక కలది

ఆవిరి ఒత్తిడి ఏ సమయమునైనను అపాయకరమైన స్థితికి చేరదు కనుక, కుక్కర్‌కు అరుగుదల చాల తక్కువ అందుచేతనే మిగతా మామూలు కుక్కర్లకన్న క్రొత్త ప్రెస్టీజ్ చాలకాలము మన్నును



### క్రొత్త ప్రెస్టీజ్ వల్ల ఎన్నో అధిక లాభములు

* ఎక్కువ మన్నికైన దళసరి అడుగు
* మన్నికైన స్టెయిన్‌లెస్ స్టీలు స్క్రూలతో బిగించిన దృఢమైన పిడులు
* ఎప్పుడు వేడెక్కని, పట్టునిచ్చు క్రొత్త "ఆక్సులరీ" పిడి
* పరుత్వము, దృఢత్వము కలిగిన క్రొత్త "ట్రివెట్"
* అద్దములాంటి అందమైన తళతళ
* ఉత్సాహము కలిగించు క్రొత్త వంటల పుస్తకము
* అనుకూలమైన ఆరు సైజులు

**మరియు ఏ లాభములవలన భారతదేశములో 30 సంవత్సరములకు పైగా ప్రెస్టీజ్ కుక్కర్ అందరికి కావలసిన కుక్కర్ అయినదో ఆ లాభములన్నీ ఇందులో వున్నాయి.**

**ttk తయారి.**




భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

తరువాత ఇలాగే చూస్తారన్న నమ్మకం ఏమిటి ? ఆ సుశీలమ్మ చాలా తెలివైంది. నయవంచకురాలు'' అనుకున్నదిగాని మళ్ళా ''ఆ ! ఇదంతా నా భయమే! వాళ్ళకు వీళ్ళకు ఏమిటి సంబంధం ! అనేక మంది సీతారామయ్యలుంటారు'' అని సరిపెట్టుకున్నది. ఏ పని చేస్తున్నా, అసలా సీతారామయ్య ఎవరో తెలుసుకోవాలని మనసు తొలుస్తున్నది. కాని ఎలా అడగాలి ? ఎవర్ని అడగాలి ? ఏమని అడగాలి ? అన్నీ సందేహాలే !

బాబుకి పాలిస్తూ భార్గవి దీర్ఘంగా ఆలోచిస్తున్నది. దగ్గర కూర్చుని ఆ మాటా, ఈ మాటా మాట్లాడి, మాధవి ''అక్కా! పొద్దున సీతారామయ్యగారంటున్నారు. కదా, ఆయన దేవూరు ? ఆయన ఎవరు ?'' అన్నది.

భార్గవి నవ్వుతూ, ''ఏం ఆయన వివరాలు అడుగుతున్నావు ? ఆయన మా నాన్నగారి ఫ్రెండు. వీడి నాన్నగారి చుట్టం'' అన్నది.

ఆ మాట అంటున్నప్పుడు భార్గవి మొహం వింత కాంతితో వెలిగిపోయింది.

''ఏ వూరు? ఏం చేస్తారు?'' మళ్ళా అడిగింది మాధవి. వివరంగా చెప్పింది భార్గవి.

క్షణ కాలం స్తంభించినట్లయింది. పగ బట్టినట్లు ఇక్కడికి కూడా దాపురిస్తున్నారు. ఇదీ ఒకందుకు మంచిదే! విశ్వనాథం, సీతమ్మగార్లతో ముందుగానే అన్ని సంగతులు చెప్పి, తన కాపురం నిలబెట్టుకోవచ్చు. విశ్వనాథం ప్లీడరు. అవసరమైతే వాదించగలడు అనిపించినా, ''ఛీ ... ఇంకా మళ్ళా వాళ్ళ మొహం చూడకూడదు. ఆ పాపిష్టివాళ్ళ గడప తొక్కగూడదు. మోహన్‌ని నమ్మకూడదు. అమ్మ కూచిలా బ్రతికే అతనికేం వ్యక్తిత్వం వుంది?''

''మాధవీ ! ఏమిటి ఆలోచిస్తున్నావ్ ? ఇవ్వాళ బాబువాళ్ళ నాన్నగారొస్తున్నారు'' ముసి ముసిగా నవ్వుతూ అన్నది భార్గవి.

''బారసాల వారం రోజులుందిగా ! ?'' అమాయకంగా అన్నది మాధవి.

''ఇంత తెలివితక్కువదానివేం ! బారసాల

## ఎదురు చూపు

కోసమా ఆయన వచ్చేది ? ఎప్పటినుంచో వస్తాం టుంటే నేనే 'బాబుకి అయిదో నెల రాకముందు మీ పప్పులేం ఉడకవు నా దగ్గర, రావద్దంటూ' రాస్తున్నాను. ఇప్పుడు గడువు తీరిందిగా...''

''అమ్మాయ్ ! మేడమీద గది సర్దించావా ? బాత్‌రూంలో నీళ్ళు పెట్టించి, తుండుగుడ్డలు అవీ రెడీగా వుంచు. అతనికి పళ్ళంటే ఇష్టం గదా! ద్రాక్షపళ్ళు, చక్కెరకేళీలు తెప్పించు. చూడు తమలపాకులయిపోయినట్లున్నయ్ ! మంచి లేత ఆకులు తెప్పించి ఫ్రిజ్‌లో పెట్టు. సుందరమ్మగారు పంపించిన జున్నుగిన్నె అందులో వుంచాను. కదిలించ కండి, అల్లుడి కిష్టం'' అంటూ సీతమ్మగారి వాగ్ధోరణి ఆగటంలేదు. మొదటిసారి అల్లుడు వస్తున్నంత హడావుడి చేస్తోంది.

''చూడు ! ఇదేదో ఫారిన్ క్లాత్‌ట, బార్‌లో అందరూ కొంటుంటే నేనూ రెండు జతలు పట్టు కొచ్చాను అల్లుడికని'' అంటూ ప్యాకెట్టు విప్పి చూపిస్తున్నాడు విశ్వనాథం.

''ఈ కలర్ ఆయనకు చాలా ఇష్టం.'' అన్నది భార్గవి.

''ప్యాంట్లు కొన్నా, పంచెలు కూడా కొనాలి'' దీర్ఘంతీసింది సీతమ్మ.

''బజారు వెళ్ళినప్పుడు తెస్తాలే !''

''ఎందుకు నాన్నా ! నేను పట్టుచీర కోసం వెళ్తాగా, అప్పుడు తీసుకుంటాలే !''

''అలాగేనమ్మా ! నీ ఇష్టం మీ ఆయన ఇష్టం, వెళ్ళేప్పుడు చెప్పు డబ్బిస్తాను.''

ఆ ఇల్లు, ఇంట్లో మనుషులు, వాళ్ళ ఆప్యాయతలు మాధవికి ఆశ్చర్యం కలిగిస్తాయి ఒక్కొక్కసారి.

తండ్రి తీసుకువచ్చి ఇచ్చిన బట్టలు తప్ప తనేనాడూ బట్టలు కొట్టుకెళ్ళలేదు. తన మనసేమిటో, తన కోరికలేమిటో తండ్రి ఏనాడూ అడగలేదు. అసలప్పట్లో తనకు కోరికలనేవి లేవు పెద్దగా ! కాని ... కొన్నిరోజులుగా తన మనసు రకరకాల ఆలోచనలు చేస్తున్నది. తన శరీరం కొత్త కొత్త అనుభవాలకు అర్రులు చాస్తున్నది. వీటి పరిణామం, పర్యవసానం ఎలా వుంటుందో ! ''ఆత్మ స్థైర్యాన్ని ప్రసాదించు భగవంతుడా!'' అనుకున్నది మాధవి.

''ఈ పాలు తీసుకెళ్ళి బాబుకి పట్టు. ఏడుస్తున్నాడు'' అన్నది సీతమ్మ.

మాధవి పాలసీసా తీసుకెళ్ళి బాబు నోటికి అందించి, ఉయ్యాల్లో పక్క సర్దివచ్చింది.

భార్గవి భర్త సూర్యం వచ్చినప్పటినుంచి పసిపిల్లవాడి పనంతా మాధవిమీదే పడ్డది. భార్గవి, ఆమె భర్త పగలస్తమానం షాపింగని, తెలిసిన వాళ్ళింటికని, వెళ్ళటం సాయంకాలం అయ్యేసరికి సినిమాకు బయల్దేరటం. ఇహ రాత్రి అల్లుడికి విశ్రాంతిభంగమని సీతమ్మ మనవడి ఉయ్యాల ప్రక్కనే మంచం వేసుకునేది. దాంతో తెల్లవార్లూ బాబు అవసరాలు మాధవి చూడవలసి వచ్చేది. బారసాల ఇహ రెండు రోజులే వుంది. మాధవి మనసు స్థిమితం కోల్పోయింది. తను వాళ్ళకంట పడ కూడదు. ఏం చేయాలి ? ఎలా తప్పించుకోవాలి ? ఏ పని చేస్తున్నా ఇదే ఆలోచన. బంధువులు ఒక్కొక్కరే రావటం మొదలుపెట్టారు. ఉన్నట్లుండి మాధవికి కడుపునొప్పి ప్రారంభ మయింది. మధ్యాహ్నందాకా ఆ మందు ఈ మందు వాడినా ప్రయోజనం లేక సాయంకాలం ఆస్పత్రికి వెళ్ళింది. డాక్టరుకు కేసు అర్థంకాక ఇన్‌పేషెంటుగా వుండిపొమ్మన్నాడు. అప్పటికిగాని మాధవి మనసు కుదుటపడలేదు.

ఇన్నాళ్ళూ బాగానే వుండి సమయానికి మాధవి ఆసుపత్రిలో చేరటం సీతమ్మకు చెయ్యి విరగ్గొట్టుకున్నట్లయింది.

''అన్నింటికి 'నేను' అంటూ చేతిలో పని అందుకునేది. అలాంటి పిల్ల ఇలా అయిపోయింది. త్వరగా ఇల్లు చేర్చు'' అంటూ దండాలు పెట్టింది దేవుడికి.

బారసాల అయిన మర్నాడు మాధవి ఇంటికి వచ్చేసింది. అయితే మాధవి భయపడ్డట్లు సీతారామయ్య కుటుంబం రాలేదు. ''అయ్యో ! అనవసరంగా పిన్నిగార్ని ఇబ్బంది పెట్టానే ?'' అని నొచ్చుకున్నది.

భార్గవి వెళ్ళినప్పటినుంచి, సీతమ్మగారు అస్తు వుస్తు మంటున్నది కొంత అనారోగ్యంవల్లనూ, కొంత బెంగవల్లనూ ! దాంతో ఇంటిపనంతా మాధవిమీదే పడ్డది. ''రేపు మాధవి వెళ్ళిపోతే... ఎక్కడికి వెళ్తుంది? ఎందుకు వెళ్తుంది. వెళ్ళకుండా చెయ్యాలంటే ఒకటే మార్గం. చిన్న ఉద్యోగం చేసుకునేవాడ్ని ఎవర్నన్నా తీసుకువచ్చి పెళ్ళి చేసి, అవుట్ హౌసులో అట్టే పెట్టుకోవటం. ఈమెకు అక్క చెల్లెళ్ళు, అన్నదమ్ములు ఎవరూ లేరా ?'' ఈ మాటే అడిగింది ఒకరోజు మాధవిని.

''నాకు పెళ్ళి పేరంటం ఏం వద్దు. మీ చల్లని నీడన నా బ్రతుకు వెళ్ళదీసుకుంటాను'' అన్నది మాధవి.

''నువ్వేం ముసలిదానివా ? ముతకదానివా ?






# నిప్పో స్పెషల్

నిప్పో స్పెషల్ ఎప్పుడూ సరికొత్తగా 'టాప్ సీల్'తో నాణ్యతకి సంబంధించిన ISI చిహ్నంతో వస్తుంది. టాప్ సీల్ వున్న మొట్టమొదటి పేవర్ క్లాట్ బ్యాటరీ నిప్పో స్పెషల్. ప్రపంచ ప్రసిద్ధి చెందిన నేషనల్ కంపెనీ (జపాన్) సాంకేతిక విధానంతో ఇది తయారుచేయబడింది.

అత్యుత్తమంగా పనిచేస్తుంది. దీర్ఘకాలం మన్నుతుంది. టార్చి లైట్లకి మరియు ట్రాన్సిస్టర్లకి అనువైన బ్యాటరీ నిప్పోస్పెషల్.

NIPPO SPECIAL
DUAL PURPOSE
Long Life
National
MADE IN INDIA



## నిప్పో స్పెషల్

National

**ప్రపంచ ప్రసిద్ధిచెందిన జపాన్‌లోని నేషనల్ కంపెనీ సాంకేతిక విధానంతో తయారుచేయబడింది.**

NL-2470

వయసులో వున్న ఆడపిల్లవు. నువ్వు వంటరిగా వుందామనుకున్నా ఈ లోకం వుండనివ్వదు.'' మందలింపుగా అన్నది సీతమ్మ.

తరువాత మాధవి మర్చిపోయినా సీతమ్మ ఆలోచిస్తూనే వుంది. తెలిసినవాళ్ళద్వారా ప్రయత్నం చేస్తోంది.

అప్పుడప్పుడు తన పెళ్ళి గురించిన మాటలు సీతమ్మ, విశ్వనాథం మాట్లాడుకోవటం, ఒకరిద్దరు పెళ్ళికొడుకుల్ని పెళ్ళిచూపులకంటూ తీసుకురావటం జరిగింది.

మాధవిలో నిద్రాణమైవున్న కోర్కెలు మనసులో అంతర్యుద్ధం మొదలుపెట్టాయి.

'తిరిగి మోహన్ దగ్గరికే వెళ్ళిపోతే !?' అని కూడా అనుకోకపోలేదు. కానీ ... అప్పటికే పెళ్ళి ప్రయత్నాలు మొదలుపెట్టారు. ఇప్పుడతను మళ్ళీ పెళ్ళి చేసుకుని భార్యతో హాయిగా వుండివుంటాడు. తన పొడ పెద్దవాళ్ళకసలు పడదు. తను ఏ ఆధారంతో ఆ ఇంటి కోడలిగా వెళ్ళగలదు ?

సీతమ్మగారన్నట్లు శరీరం మగతోడు కోరుతున్నా, ఆడ మనసు అందుకు అంగీకరించటంలేదు.

మాధవిని దురదృష్టం అంతటితో వదలిపెట్టలేదు. తన సుఖాన్నీ, క్షేమాన్నీ కోరే సీతమ్మగారు పక్షవాతం వచ్చి మంచంలో వున్నారు. ఆ సంగతి తెలిసిన వెంటనే భార్గవి గుండెలు బాదుకుంటు వచ్చి తల్లిని చూసి, ఓ వారం వుండి వెళ్తూ —

''మాధవీ! నువ్వున్నావనే ధైర్యంతో నేను వెళ్తున్నాను. అమ్మనెలా కాపాడి మామూలు మనిషిని చేస్తావో? ఇప్పుడు ఆమెకు నేను కాదు కూతుర్ని, నువ్వే!'' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుని వెళ్ళింది. అప్పటినుంచి బంధువులు, స్నేహితులు వచ్చేవారు వస్తుంటే వెళ్ళేవాళ్ళు వెళ్తున్నారు. మాధవి అటు సీతమ్మ పనితోనూ, ఇంటికివచ్చి వెళ్ళేవాళ్ళ మర్యాదలతోనూ, చిక్కిశల్యమైంది.

ఒకరోజు మధ్యాహ్నం మూడు గంటల వేళ, సీతమ్మగారికి పళ్ళరసం పడుతున్న మాధవి, గుమ్మంలో నుంచున్న వ్యక్తిని చూసి, క్షణం నిర్ఘాంతపోయింది. తన కళ్ళను తనే నమ్మలేకపోయింది. ఇది నిజమా ? అని నాలిక కొరుక్కుని పరీక్ష చేసుకుంది. నిజమే! అతను మోహన్! ఎవర్ని ఎవరు ఎలా పలకరించాలి ?

ఇద్దరూ మౌనం వహించారు కాసేపు.

విశ్వనాథం ఇంట్లోలేరు. సీతమ్మగారు మాట్లాడలేదు. ఇహ ఆ ఇంట్లో మనిషితనే!

తప్పదు అనుకుని, ''ఎవరు కావాలి ?'' అన్నది తనకు పరిచయం లేనట్లు.

''నువ్వే!'' అని నోటిదాకా వచ్చింది కాని తమాయించుకుని, ''విశ్వనాథంగారు లేరా ?'' అన్నాడు.

''లేరు !'' ముక్తసరిగా అన్నది మాధవి.

కాసేపు సీతమ్మ దగ్గర కూర్చుని, బయటకు వెళ్ళి వరండాలో కూర్చున్నాడు మోహన్.

''మంచినీళ్ళు కావాలా ?'' గడప లోపల నుంచుని అడిగింది మాధవి.

## ఎదురు చూపు

''మాధవీ ?'' ఆర్తిగా అన్నాడు మోహన్.

మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది అతనికి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా !

మాధవి ఇక్కడికెలా వచ్చింది ? ఎప్పుడు వచ్చింది ? ఇన్నాళ్ళూ ఎక్కడున్నది. సమాధానం ఎవరు చెబుతారు ? మోహన్ కి కావలసింది సమాధానం కాదు. తన భార్య. తను ఇన్నాళ్ళూ ఎవరికోసమైతే నిరీక్షిస్తున్నాడో ఆమె. ఆమె ఇక్కడ ప్రత్యక్షమైంది. తన తపస్సు ఫలించింది. తన ఎడారి బ్రతుకులో నందనవనం వెలిసింది. అతడి అంతరంగం విరిసిన హరివిల్లులా, ఎగసిపడే సాగర తరంగంలా వుంది. ఆ ఆనందంలో విశ్వనాథం రాకను గమనించలేదు మోహన్.

### విషం చికిత్స !

విషాన్ని వుపయోగించి పశ్చిమ జర్మనీలో కేన్సర్ రోగులకు చికిత్స చేస్తున్నారు. ప్రతి సంవత్సరం 60 నుండి 80 మందికి ఎముకల కేన్సర్ వ్యాధి సోకుతున్నది. వీరి వయసు 20 సంవత్సరాల లోపే వుంటున్నది. రోగ నిర్ధారణ అయిన వెంటనే యీ రోగులకు ఆపరేషన్ జరిపి ప్రమాదకరమైన క్రొత్త మందును యిస్తున్నారు. అయితే యిది మరీ విషపూరితం కావడంతో, వెంటనే దీనికి విరుగుడుగా మరో మందును కూడా వుపయోగించి దుష్ఫలితాలను తొలగిస్తున్నారు. ఈ రకం చికిత్స వలన వ్యాధి ఉపశమనం చెంది యీ రోగులు మరో ఐదు సంవత్సరాలపాటు జీవించడానికి అవకాశం ఏర్పడుతున్నది. ఈలోపుగా సమగ్రమైన చికిత్స లభించగలదనే ఆశ కూడా లేకపోలేదు.

''ఏమోయ్ ! ఎప్పుడు రావటం'' అంటూ ఆయనే పలకరించాడు.

''ఓ గంటయింది ఇక్కడికి వచ్చి. మధ్యాహ్నం ఇంటర్వ్యూ వుంది. అందుకని పొద్దునే బయల్దేరి వచ్చాను.''

''బాగా చేసావా ?''

''ఆ !''

''అయినా ఈ ఉద్యోగాలు నీకెందుకు? హాయిగా వ్యాపారం చేసుకోక ?''

''ఈనాడు బిజినెస్ చెయ్యటం అంత తేలిక కాదు. ఎంతో అనుభవం వున్న నాన్నగారే ఒకొక్కసారి చీకాకు పడుతున్నారు.''

మోహన్ విశ్వనాథంతో మాట్లాడుతున్నా, మనసు మాధవివైపు పరుగులు తీస్తూనేవుంది. ఆమె చర్యలను గమనిస్తూనేవుంది. ఆ ఇంటికి, మాధవికి ఎంతటి బాంధవ్యం వుందో, ఆ ఇంట్లో మనుషులకు మాధవి అవసరం ఎంతగావుందో గమనిస్తూనేవున్నాడు.

''తన మూలంగానే ఇదంతా జరిగింది. తన అసమర్థతవల్లనే తన భార్య మరొకరి పంచన తల దాచుకుని వాళ్ళకు దాసీగా మారిపోవలసి వచ్చింది.'' ఈ భావం రాగానే తనమీద తనకే ఏహ్యభావం కలిగింది. ఆమెమీద జాలి, అభిమానం, అనురాగం పెరిగాయి. ''మగవాడివల్ల ఆడది ఎప్పుడూ కష్టాల పాలవుతూనే వున్నది. తెలిసో తెలియకో అనాదిగా స్త్రీకి అన్యాయమే చేస్తున్నాడు పురుషుడు. ఎంతో ఆదర్శవంతుడినని రొమ్ము విరుచుకుని, పెళ్ళి చేసుకుని ఇంటికి తీసుకువచ్చి ఆమెకు తను చేసిందేమిటి ?'' ఆరోజు రాత్రి మేడమీద పడుకున్నప్పుడు జరిగిందంతా విశ్వనాథంగారికి చెప్పాడు. చెప్పి, ''మాధవిని నేను తీసుకువెళ్తాను'' అన్నాడు మోహన్.

''తప్పకుండా తీసుకువెళ్ళు. మాధవి చాలా యోగ్యురాలు. ఇంతకాలంగా చూస్తున్నాను, ఒక్క విషయంలో కూడా వేలెత్తి చూపించుకోలేదు.''

ఇప్పుడు విశ్వనాథానికి మాధవి ఎంతో వున్నతంగా కనిపిస్తున్నది. ఇంతటి బడబానలం కడుపులో ఎలాఇముడ్చుకోగలిగింది? ''ఆమె సామాన్యమైన స్త్రీ కాదు. కష్టాల్లోనే వాళ్ళ వాళ్ళ మనస్తత్వాలు బయటపడతాయ్! అలాంటిది ... అలాంటిది ... ఇన్నీ తెలిసిన అమ్మాయి, తను పెళ్ళి సంబంధాలు చూస్తున్నట్లు తెలిసి కూడా తనకు పెళ్ళయిన సంగతి ఎందుకు బయటపెట్టలేదు ?'' సమాధానం దొరక్క ఆమెనే అడిగాడు ఒకరోజున.

''మోహన్ నాకు చేసిన అన్యాయాన్ని తల్చుకున్నప్పుడు అతనిమీద కసి కల్గేది. ఆ కసిలో అతణ్ని చంపెయ్యాలనీ, మళ్ళీ పెళ్ళి చేసుకుని, మగవాడికే కాదు ఆడదానికీ సుఖపడే అర్హత వుందని చెప్పాలనీ, నేనూ నా భర్త అతనింటి కెదురుగా కాపరం పెట్టి అతడ్ని అనుక్షణం చిత్రవధ చెయ్యాలనీ ఏమిటేమిటో అనిపించేది.'' వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అన్నది మాధవి.

''పిచ్చితల్లీ ! ఆవేశం మనిషిని పశువుగా మారుస్తుంది. ఆ ఆటుపోట్లకు తట్టుకోగలిగినప్పుడే మనిషి మనిషిగా మిగుల్తాడు. నీ విషయంలో అదే జరిగింది. నీలో చెలరేగిన భావోద్రేకాన్ని నీలోనే ఇముడ్చుకోగలిగావు. మోహన్ నీకు సరైనవాడమ్మా ! మనిషి ఎంత మంచివాడయినా, ఎన్ని ఆశయాలున్నా బలహీనమయిన క్షణాలు కొన్ని వుంటాయి. ఆ క్షణాలు మనిషిలోని మానవత్వాన్ని నాశనం చెయ్యవచ్చు. దొంగగా, హంతకుడిగా మార్చవచ్చు. జీవితాల్నే బలితీసుకోవచ్చు. కుటుంబాల్నే కూల్చద్రోయవచ్చు. అలాంటి అనర్థాలేం జరక్కుండా మళ్ళీ మీరు కలిసి బ్రతకబోతున్నారు. అదృష్టవంతులమ్మా ! అదృష్టవంతులు.'' చెమర్చిన కళ్ళను ఒత్తుకుంటూ అన్నాడు విశ్వనాథం.

(ఇంకా వుంది)

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు

## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్ ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




**దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి :**

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ

# భోజనంలోకి ఉపయోగించే కొన్ని రకాల పొడులు

## కంది పొడి

కావలసిన వస్తువులు :

కందిపప్పు – 2 సోలలు, శనగపప్పు – 2 సోలలు, పెసరపప్పు – 2 సోలలు, మినపప్పు 1 కప్పు, ఇంగువ తగినంత, ఉప్పు – తగినంత, కారం – తగినంత, జీలకర్ర – 3 స్పూన్లు, పసుపు -- చిటికెడు.

తయారుచేయు విధానం :

ముందుగా పప్పులన్నింటిలోను రాళ్ళు, తుక్కు లేకుండా విడి, విడిగా బాగుచేసుకుని పెట్టుకోవాలి. ఒక వెడల్పు బాణలిని స్టౌమీద పెట్టాలి. బాణలి బాగా వేడిగా అయిన తరువాత, పప్పుల్ని విడి విడిగా పోసి దోరగా వేయించి, కలిపి ఒక పళ్ళెంలో పోసుకోవాలి. జీలకర్ర, ఇంగువ కూడా కొద్దిగా వేయించి తీసుకోవాలి. తిరగలిని శుభ్రంగా తుడిచి కొంచెం, కొంచెంగా పప్పుల్ని వేస్తూ విసురుకోవాలి. పిండిని మెత్తగా విసురుకుని తీసి పళ్ళెంలో పోసుకుని తగినంత ఉప్పు, కారం, జీలకర్ర కలపాలి. ఇంగువని పొడి చేసి కలపాలి. సీసాలో పోసేముందు, పసుపు కూడా వేసి పిండిని బాగా కలిపి మూత గట్టిగా ఉన్న సీసాలో నింపుకోవాలి.

## కొబ్బరి పొడి

కావలసిన వస్తువులు :

కొబ్బరికాయ – 1, శనగపప్పు – 1 కప్పు, నూవప్పు – 1 కప్పు, ఉప్పు – తగినంత, ఎండుమిర్చి – 6, మినపప్పు – 1 కప్పు, కరివేపాకు– 2 రెమ్మలు, ఇంగువ – తగినంత, జీలకర్ర – 2 స్పూన్లు, నూనె – ¼ కప్పు.

తయారుచేయు విధానం :

కొబ్బరికాయ ముదురుగా ఉంటే కొబ్బరి పొడి బాగా వస్తుంది. కొబ్బరికాయను కోరుతో సన్నగా కోరుకోవాలి. గిన్నెలో నూనెపోసి ఎండుమిర్చి, శనగపప్పు, మినపప్పు, జీలకర్ర, ఇంగువ వేసి వేయించి తీసుకోవాలి. కొబ్బరి కోరును పొడిగా వేయించి తీసుకోవాలి. తరువాత పోపు సామాను రోటిలోవేసి తొక్కి తీసుకోవాలి. కారంలో ఉప్పు, కరివేపాకు వేసి కొబ్బరి కోరుతో కలిపి ఉంచి, వేయించిన నూవప్పు కూడా వేసి గ్రైండరులో తిప్పాలి. కొబ్బరి పొడిలో ఉప్పు, కారం సరిపోయిన తర్వాత మూత ఉన్న సీసాలో పోసుకోవాలి. ఈ పొడిని ఇడ్లీలు, దోసెల్లాంటి టిఫిన్లలోకి కూడా వాడుకోవచ్చు. ఈ కొబ్బరి పొడిని గ్రైండరులో చేస్తేనే బాగుంటుంది. రోటిలో చేస్తే ముద్దగా అవుతుంది.



'విజయ్'లో జయంతి

**ఇవన్నీ పెద్దవాళ్ళకి తెలిసినా, కొత్తకాపురం పెట్టేవాళ్ళకి ఏవి కొత్తాయని మరోసారి ఇస్తున్నాము.**

## శనగ పొడి

కావలసిన వస్తువులు :

వేయించిన శనగపప్పు – 2 సోలలు, ఉప్పు – తగినంత, కారం – తగినంత, ఎండు కొబ్బరికోరు – 1 కప్పు, జీలకర్ర–1 స్పూను, వెల్లుల్లి రేకులు – 3, నూవప్పు – 1 కప్పు.

తయారుచేయు విధానం :

ముందుగా శనగపప్పులో రాళ్ళు లేకుండా ఏరుకుని రోటిలోపోసి మెత్తగా పొడికొట్టి పళ్ళెంలోకి తీసుకోవాలి. నూవప్పు దోరగా వేయించి దాన్ని కూడా రోటిలో మెత్తగా గుండకొట్టి శనగపొడిలో కలపాలి. ఎండుకొబ్బరి కూడా కొంచెం వేయించి జీలకర్ర, ఉప్పు, కారం, శనగపొడిలో కలపాలి. వెల్లుల్లి రేకులు కొంచెంగా తొక్కి పొడిలో కలపాలి. శనగపొడిలో ఉప్పు, కారం సరిపోయిన తరువాత సీసాలో భద్రం చేసుకోవాలి. ఈ పొడి కూడా టిఫిన్లలోకి బాగుంటుంది. కరివేపాకు కూడా ఇష్టం ఉంటే వేసుకోవచ్చు.

## కరివేపాకు పొడి

కావలసిన వస్తువులు :

కరివేపాకు–8 కట్టలు, ఉప్పు–తగినంత, ఎండుమిర్చి – 6, చింతపండు – చిన్నముద్ద, శనగపప్పు – ½ కప్పు, మినపప్పు – ½ కప్పు, ఆవాలు – 3 స్పూన్లు, జీలకర్ర–1 స్పూను.

తయారుచేయు విధానం :

కరివేపాకు కట్టలు మార్కెట్టులో అమ్ముతారు. కరివేపాకు ఎక్కువగా ఉంటేనే బాగుంటుంది. కరివేపాకు ఆకుల్ని శుభ్రంగా కడిగి ఎండ పెట్టుకోవాలి. బాణలిలో నూనె పోసి ఎండుమిర్చి, శనగపప్పు, ఆవాలు, జీలకర్ర వేయించి తీసుకోవాలి. కరివేపాకును పోపు వేయించిన గిన్నెలోవేసి ఎర్రగా వేయించి తీసుకోవాలి. తరువాత పోపు సామాను, చింతపండు, ఉప్పు కలిపి మెత్తగా దంచాలి. దంచిన తర్వాత కరివేపాకు కూడా వేసి పొడి కొట్టుకోవాలి. మూత ఉన్న సీసాలో పోసుకోవాలి. కరివేపాకుతో చేసిన పొడి ఆరోగ్యానికి కూడా చాలమంచిది.

## కారప్పొడి

కావలసిన వస్తువులు :

ధనియాలు – 1 సోల, చింతపండు - తగినంత, ఉప్పు – తగినంత, పసుపు – చిటికెడు, శనగపప్పు – 4 స్పూన్లు, ఆవాలు– 3 స్పూన్లు, ఎండుమిర్చి – 6, కరివేపాకు – 2 కట్టలు, మినపప్పు – 4 స్పూన్లు, ఎండుకొబ్బరి – చిన్నముక్క.

తయారుచేయు విధానం :

ధనియాలు బాగుచేసుకుని కొంచెంగా నూనె వేసి దోరగా వేయించి తీసుకోవాలి. ఎండుమిర్చి, ఆవాలు, శనగపప్పు, మినపప్పు కూడా వేయించి పెట్టుకోవాలి. తరువాత రోటిలో పోపు సామాను, ఉప్పు, ఎండుకొబ్బరి ముక్క, చింతపండు వేసి మెత్తగా దంచుకోవాలి. రోటిలోంచి కారం తీసేసి ధనియాలు వేసి వాటిని మెత్తగా దంచింతరువాత కారం, పసుపు, కరివేపాకు ధనియాలపొడిలో వేసి మళ్ళీ బాగా కలిసేలా దంచి సీసాలోకి తీసుకోవాలి. ఇష్టం ఉన్నవాళ్ళు రెండు వెల్లుల్లి రేకులు కూడా వేసుకోవచ్చు. ఇది కూడా అన్ని టిఫిన్లలోకి వాడుకోవచ్చు.

— పి. రామమతి

# ఎన్నికల గురించి ఎన్ని కలలో!, కోటి




















# ఆనందాల పంట
# ...దాన్ని పెంచి పోషించేది జై కిసాన్

జైకిసాన్ మీ పంటలను పెంచి పోషిస్తుంది, మీ కలల్ని నిజమని నిరూపిస్తుంది. అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా గల జైకిసాన్ శక్తివంతమైన ఎరువులు భూమిలో వెంటనే కరిగి మీ పంటలకు అపారమైన శక్తినీ, తక్షణమైన పెరుగుదలనూ చేకూరుస్తాయి. మీ పైర్లతోపాటే మీ భాగ్యంకూడా వికసిస్తుంది ...మీకు హెచ్చు దిగుబడినీ, దాంతోపాటు హెచ్చు సంపదనూ ఇస్తుంది జైకిసాన్. గుర్తుంచుకోండి, ప్రతి పంటకు, ప్రతి భూమికి అవసరానికి తగిన పాళ్లలో వేయడానికి జైకిసాన్ ఎరువు ఉంది. జైకిసాన్ ఎరువుల విస్తృతమైన శ్రేణిలోంచి మీరు మీకు కావలసినదాన్ని ఎంచుకోవచ్చు.

**జై కిసాన్ యూరియా 46.4% నత్రజని** అతి తెల్లటిది, అతి స్వచ్ఛమైనది, అతి శక్తివంతమైనది. దీనిలో బైయూరేట్ పాలు అతి తక్కువ (0.5% కంటే తక్కువ). అంచేత ఆకుల మీద పిచికారి చేయడానికి సురక్షితమైనది. అన్ని పంటలకూ భూమిమీద పై చల్లుగా అనువైన ఎరువు.

**జై కిసాన్ యూరంఫాస్ 28:28:0** అత్యధికంగా నత్రజని, ఫాస్ఫేటూ సమానమైన పాళ్లలో గల శక్తివంతమైన ఎరువు. దాదాపు పూర్తిగా నీటిలో కరుగుతుంది. దీనిలోని రెండు పోషక పదార్థాలూ కూడా ఒకే సమయంలో భూమిలో కరిగి పెరుగుతున్న పంటకు అందుబాటులో ఉంటాయి.

**జై కిసాన్ సంపూర్ణ 19:19:19** అతి చిక్కనైన కాంప్లెక్స్ ఎరువు. దీనిలో నత్రజని, ఫాస్ఫేటు, పొటాష్‌లు సమానమైన పాళ్లలో ఉన్నాయి. దాదాపు పూర్తిగా నీటిలో కరిగే ఈ ఎరువులో 57% పోషక పదార్థాలున్నాయి. అవన్నీ ఒకే సమయంలో భూమిలో కరిగి పంట వాటిని సులభంగా గ్రహించడానికి వీలు పడుతుంది. పొటాష్ లోపం గల భూములకు జైకిసాన్ సంపూర్ణ ప్రత్యేకించి లాభదాయకమైనది.

**జైకిసాన్ యూరంఫాస్, సంపూర్ణ ముఖ్యంగా అధిక దిగుబడి రకపు వరి, చెరకు, కాయగూరలు, పత్తి, జొన్న, గోధుమ మొదలైన పంటలకు బాగా అనువైనవి. అంతేకాదు, కాఫీ, తేయాకు లాంటి తోట పంటలకూ, మామిడి, కమలా, నారింజ, అరటి మొదలైన పండ్ల తోటలకూ కూడా ఎంతో అనువైనవి.**

**జై కిసాన్ సౌభాగ్య 14:35:14** నత్రజని, పొటాష్‌లు దీనిలో సమానమైన (ఒక్కొక్కటి 14%) పాళ్లలో ఉన్నాయి. పైగా 35% ఫాస్ఫేటు కూడా ఉంది—అంటే మొత్తం 63% పోషక పదార్థాలు ఉన్నాయన్నమాట. ఫాస్ఫేటు హెచ్చుగా ఉండటం వల్ల జైకిసాన్ సౌభాగ్య ముఖ్యంగా వేరుశనగ, ఇతర నూనె గింజల పంటలకూ, పప్పు దినుసుల పంటలకూ బాగా అనువైనది. దుంపజాతి పంటలైన బంగాళాదుంప (ఆలుగడ్డ), పసుపు, కందమూలం, ఉల్లి మొదలైనవాటికి కూడా ఎంతో మంచిది. చెరకు, పత్తి పంటలకూ, ఏలకులు మొదలైన తోట పంటలకూ కూడా ఉపయోగకరమైనది.

**జై కిసాన్ డయంఫాస్ 18:46:0** డయంఫాస్ 18:46:0 లో 18% నత్రజని, 46% ఫాస్ఫేటు ఉన్నాయి. అత్యధికంగా పాళ్లు కలిగిన కాంప్లెక్స్ ఎరువు అయినందువల్ల తక్కువ పరిమాణంలో వేస్తే చాలు. అంచేత ఖర్చుకూడా చాలా తక్కువ. ఈ ఎరువు ప్రత్యేకించి, హెచ్చుగా ఫాస్ఫేట్ కావలసిన పంటలకు అంటే వేరుశనగ, పప్పు దినుసులు, నూనె గింజలు మొదలైన వాటికీ, పసుపులాంటి దుంపజాతి పంటలకూ అనువైనది. చెరకు, పత్తి పంటలకు కూడా మంచిది.

## జై కిసాన్ ఎరువులు-అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ




**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.**
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: కర్నూలు, సికింద్రాబాద్, బెంగుళూరు, హుబ్లి, కొంకణ్, నాగపూర్, పూనా.
మీ జైకిసాన్ ఎరువుల్ని జువారి వారి పసుపు పచ్చ దుకాణాల్లో కొనుక్కోండి.






డి. కె. ఆర్. – బైపల్లి

నా స్నేహితులు కొందరు నా ముందు బాగా మాట్లాడుతారు. కాని తర్వాత నన్ను గురించి చెడుగా అనుకుంటారు ...

★ అలాంటి వాళ్ళు స్నేహితులు అవరు. నిజమైన స్నేహితురాలు నిష్ఠూరమైనా మొఖం ముందు అంటుంది. ఎవరేనా తన స్నేహితులని ఏమైనా అన్నా — అక్కడికక్కడే త్రుంచేస్తుంది ... మన ముందూ — మన వెనుకా కూడా మనని ఆదుకునేవాళ్ళే నిజమైన స్నేహితులు.

భర్త వయస్సుకన్న భార్య వయస్సు ఎక్కువ ఎందుకు వుండకూడదు ?

★ ఉండకూడదనేం లేదు. కాని అసలే మన మగవాళ్ళు పెళ్లి—పెళ్లాం అంటే, సెక్సు—సంతానంగా అర్థం చేసుకుంటారు. భార్యలు కుటుంబ భారంతో, మానసికమైన ఒత్తిడులతో, సంతానోత్పత్తితో — పదేళ్లకి పాతికేళ్లు పెరిగినట్టు వుంటారు. అందేత ముందుచూపుతో చేసిన సూచన అది. అంతేగాని శాస్త్రం కాదు — మీరే ఆలోచించండి. నలభై ఏళ్లకి ఆడదాన్ని ముసిలిది అనేస్తారు. అదే నలభైకి — పూలరంగడులా — కొత్త అనుభవాలు వెతుక్కుంటూ పోతాడు మగవాడు !

జి. ఎస్. – మొగలవల్లి

నేను ఒక అమ్మాయిని ప్రేమించాలనుకున్నాను. కాని అదే అమ్మాయిని మా అన్న కూడా ప్రేమించాలనుకున్నాడు.

★ 'అయితే గీతే అయితంపూడి ఉద్యోగం' అన్నట్టు వుంది మీ గోల. ఇద్దరూ ప్రేమిస్తే — ఏదో — సుందోపసుందుల్లా కొట్టుకు చావండనో — నాగేస్వర్రావు డ్యూయట్ రోల్‌లోలాగా ఒకరు త్యాగం చేయండనో చెప్పేదాన్ని. ఇప్పుడేం చెయ్యను ? అమ్మాయి ఎడ్రసివ్వండి — త్వరగా వేరెవరినేనా పెళ్లాడమని చెప్తాను !

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

ఎస్. కె. ఆర్ – విశాఖపట్నం

ఆమెచేత ఉద్యోగం చేయిస్తూ రాబడిలోనుంచి మంచి పనుల కోసం వెచ్చించడమా ? ఉద్యోగం మానిపించి నిరుద్యోగ సమస్యను తగ్గించడమా? ఏది గొప్ప దేశభక్తి ?

★ లోకోపకారం కోసం మీ పెళ్లాంచేత ఉద్యోగం చేయించడమో, మానిపించడమో — కాదు గొప్ప దేశభక్తి. ఆమె యిష్టాయిష్టాలు గమనించడం — గొప్ప పని.

కె. ఎస్ – కాకినాడ

మీరిచ్చే సలహాలను ఎంతవరకు పాఠకులు అమలులో పెడుతున్నారో ఆలోచించారా ?

★ నావి — సలహాలు కాదు; నా జవాబు — మీ అనుమానానికి — అదీ మీకు నచ్చినా ఫరవాలేదు, నచ్చకపోయినా ఫరవాలేదు; ఎందుకంటారా ? మీరు ప్రశ్న వేళాకోళంగా అడిగినా నా జవాబు నిజాయితీగానే వుంటుంది.

పిహెచ్. ఎస్. – విడదవోలు

ఎక్కువ సినిమాలు చూస్తే కళ్లకి యిబ్బంది అంటారు. మరి నటులు ఎక్కువ లైటింగులో నటిస్తారు. కాని ఎంత వయసొచ్చినా కళ్లజోడు ఉపయోగించరు. మనం చిన్న వయసులోనే కళ్లజోడు పెట్టుకోవలసి వస్తుంది ?

★ అంటే అర్థం కాలేదా ? చూసేవాళ్లకు నష్టంగాని తీసేవాళ్లకు, నటించేవాళ్లకు ఏం నష్టం లేదని !!

ఎ జె ఎస్. – అనంతపురం

ద్వేషానికి మోహానికి చాలా సన్నిహితం ఎందువల్ల ?

★ రెండూ — పని అయ్యాక చల్లారిపోయేవే !!

ప. రేం ద – ఆదోని

ఈ రోజుల్లో కథగాని, నవలగాని చదివితే అది రాసినది రచయితో, రచయిత్రో వూహించి చెప్పేయొచ్చా ?

★ అయినా మగవాళ్ళు ఆడపేర్లు పెట్టుకుని మురిసిపోతున్నారు — మాడా వేషగాళ్లలాగ !

టి. బి. – తిరుపతి

తాళిబొట్టుకు విలువ లేదంటాడు నా స్నేహితుడు. ఆన్సర్ ?

★ కట్టే పెద్దమనిషి దాని విలువ గుర్తించకుండా — కట్టేస్తే — విలువ లేదు. అందుకే అవసర నైవేద్యంగా ఏ దేవుడి గుళ్ళోనో, దేవుడి పటం ముందో కట్టేసే రకరకాల తాళిబొట్టుల కంటే—రిజిస్ట్రారుగారిముందు పెట్టిన సంతకానికి — విలువ ఎక్కువ.

టి. కె డి. – బొంబాయి

మన పవిత్ర భారతదేశంలో మహిళామణులు మనీ కొరకు మానాన్ని అమ్మడం ఎందుకు ?

★ జానెడు పొట్ట నింపుకొందుకు ? "యత్ర నార్యంను పూజ్యతే" కబుర్లు చెప్పేవాళ్లేగాని — ఆడదానికి గౌరవం చూపెట్టేవాళ్లు తక్కువ.

ఆవారా – ఖర్గపూరు

తనువు శాశ్వతం కాదు కదా, మరీ తాపత్రయం ఎందుకు ?

★ బ్రతికున్నంతసేపూ — యీ శరీరానికి అవసరాలు తప్పవు కదా ? అందుకు !

★

## ఇదీ నేటి పరిస్థితి!

ఏమిటి సాధించింది మనం —
ధరలు పెరుగుటే
మన అభివృద్ధియా ??
ఎక్కడైనా ఉన్నదా ఇది !
అన్నపూర్ణ ఇంట్లో
భోజనం ఖరీదు
ఐదు రూపాయలా ?
ఐనా వడ్డించటానికి
రారేం "సర్వేశ్వరులు",
"టిప్పు" సుల్తానులు !!

ఏది దొరుకుతున్నది
సులభంగా అసలు, గురూజీ ??
మా వాడు ప్యాసైనాడని
సంతోషం లేదు —
పై క్లాసుకు సీటు
దొరకటం లేదు —
డొనేషన్ లేందే ...

మా ఆవిడ అమ్మగారి
ఇంటికి వెళ్ళాలన్నా
మ్రొక్కు తీర్చుకోవటానికి
తిరుపతి వెళ్ళాలన్నా
రైలు టిక్కెట్లు ఏవి ??
ముందే, మూడు నెలల
క్రిందటే అమ్మేశారుట.
దొరుకుతాయట
"చీకటి పడ్డాక"
నల్లకోటు రైలు "గేటు" వద్ద.

నేను ఒకవేళ
ఉత్తరం వ్రాసినా
పోస్టు చేసినా
అది చేరుతుందో లేదో —
పోస్టల్‌వారిమీద కూడ
నమ్మకం పోయింది నాకు.

ఇదివరకు ఎల్. ఐ. సి. మీద
నాకు బాగా నమ్మకం వుండేది.
ఐతే అదీ క్షీణించిపోతున్నది
నా తర్వాత "క్లయిమ్"
పరిశీలిస్తారో లేదో అని —
భయంగా వుంది.

వాళ్ళు కూడ పాపం
కంప్యూటర్లని చూసి
పడుతున్నారు భయం.
ఉద్యోగాలకు ఎవరు పెడుతున్నారు
ఎంప్లాయిమెంట్ ఎక్చేంజిలు.
ఏ అర్హతలూ అక్కరలేని
ఉద్యోగాలు ఏమిటి అంటే
మన రాష్ట్రంలోనూ, మన దేశంలోనూ
మంత్రి పదవులు ఒక్కటే
కాదా !! గురూజీ ??...

— ఎం. ఎస్. ఎం.




# టాన్‌టెక్స్®

## యే విధంగా చూచినా ఉత్తమమైనది

శ్రేష్టతలో-వస్తువులో-తయారులో;
గాలి చొరని మన్నికగల ప్యాకింగులో,
మరియు సరసమైనది కూడా....

IS 4964



మీకు ఖచ్చితంగా
సరిపోతుంది
టాన్‌టెక్స్

టాన్‌టెక్స్ విస్తృత శ్రేణి:
బ్రీఫ్‌లు ● వెస్ట్‌లు
క్యాషుయల్స్ ● స్పోర్ట్స్
● పిల్లల దుస్తులు



టాన్‌టెక్స్
ttk తయారీ

టి.టి. కృష్ణమాచారి అండ్ కో.
మదరాసు 600 086.

# సినిమా

—జి.వి.జి

## శ్రీరస్తు - శుభమస్తులో పెళ్ళి చూపుల్లోనే పెను తుఫాను

రామచంద్రయ్య(పి.ఎల్. నారాయణ) ఇల్లు... హాలులో పెళ్ళి చూపులకు వచ్చిన వారందరూ కూర్చొని ఉన్నారు. వాళ్ళ వంక చూస్తూ రామచంద్రయ్య "నా మనవరాలని చెప్పుకోవడం కాదుగాని, ఈ కాలంలో పుట్టవలసిన పిల్లకాదు. బంగారం లాంటి గుణం. చదువుకున్న పిల్లయినా— వంట వార్పు, ఓర్పు నేర్పు అన్నీ తెలుసు," అన్నాడు.

ఇంతలో లోపలినుంచి దేవి (సరిత)ని తీసుకొని వచ్చింది అనసూయ (అత్తిలి లక్ష్మి). దేవిని చూడగానే పెళ్ళికొడుకు నొసలు చిట్లించాడు. అతనికేదో గుర్తుకొచ్చి, తండ్రి చెవిలో రహస్యంగా చెప్పాడు. ఆయన వెంటనే లేచి, "అలాగా! అయితే, ఇంకెందుకూ — పదండి," అన్నాడు.

"అదేమిటి, బాబూ! పెళ్ళి చూపులకు వచ్చినవాళ్ళు మంచీ చెడ్డా మాట్లాడకుండా వెళ్ళిపోతే ఎలా?" అన్నాడు రామచంద్రయ్య.

పెళ్ళికొడుకు సమాధానమిచ్చాడు: "నేను రిజిస్ట్రార్ ఆఫ్ మేరేజస్ ఆఫీస్‌లో పని చేస్తున్నాను. మీ అమ్మాయి ఇంతకు ముందే ఓ సారి మా ఆఫీసుకు పెళ్ళికోసం వచ్చి వెళ్ళింది. అవునో కాదో ఆమెనే అడగండి."

దేవి తల వాల్చేసింది. రామచంద్రయ్య నిర్ఘాంతపోయాడు. అనసూయకు దుఃఖం ముంచుకొచ్చింది. "నా కడుపున చెడబుట్టావు కదే! పోయినదానివి అలా ఎవరితోనైనా పోయినా

'శ్రీరస్తు—శుభమస్తు'లో చిరంజీవి, సరిత







'ప్రేమ మందిరం'లో ఒక సన్నివేశం

బాగుండేది. లేదా, ఉరిపోసుకుని చచ్చినా బాగుండేది. ఒక్కసారే ఏడ్చి ఊరుకునేదాన్ని. కాని, నువ్వు చేసిన వెధవ పనికి జీవితాంతం ఏడవ్వాలి కదే!"

దేవి గద్గదకంఠంతో "అమ్మా, నేనేం తప్పు పని చేయలేదు. నా మాట నమ్మమ్మా. చేసిన చిన్న పొరబాటును సరిదిద్దుకోడానికి ప్రయత్నిస్తాను. నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకుంటాను. నలుగురిలోనూ మీరు తలెత్తుకునేలా చేస్తాను. అలా చేయలేని నాడు నా గొంతుకు నేనే ఉరిపోసుకు చస్తానమ్మా— చస్తాను," అంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

కట్టా సుబ్బారావు దర్శకత్వం వహించే శ్రీ ఆరయమ్మన్ క్రియేషన్స్ "శ్రీరస్తు—శుభమస్తు" చిత్రానికి కె. నరసింహారావు, వై. వెంకటేశ్వరరావు, డోగిపర్తి సోమయ్య నిర్మాతలు.

## అల్లుళ్ళొస్తున్నారులో తారుమారు

టీపాయ్‌మీద ఖాళీ చేసిన పళ్ళాలు చాలా పడున్నాయి. చంద్రం (చంద్రమోహన్) ఒకచేత్తో ఐస్‌క్రీమ్ చప్పరిస్తూ, మరో చేత్తో ఉప్మా లటగా తింటున్నాడు. రెప్పలార్పకుండా మంచంమీద కూర్చొని చూస్తున్న గోపీ (చిరంజీవి) "ఐస్‌క్రీమ్ మరోటి తింటావా?" అన్నాడు.

"వద్దురా. అయినా, నువ్వేం తినకుండా నన్నే తినమంటూంటే నాకు కాస్త మొహమాటంగా ఉంది ...ఇవన్నీ తినేశాక అలా హాయిగా మ్యూజియం, జూ చూసి వద్దాం," అన్నాడు చంద్రం త్రేన్పుతూ.

"రావడం దేనికి? ఆ జూలోనే ఒక బోను చూసుకుని, అందులో సెటిల్ అయిపోదాం. లేకపోతే ఏమిట్రా? మనం మద్రాసు వచ్చింది అవి ఇవీ చూడ్డానికా, పని చూడ్డానికా?"

"చూసుకుంటూనే ఉన్నాంగా?" అన్నాడు చంద్రం గులాబ్‌జామ్ ఒకటి అమాంతంగా స్వాహా చేస్తూ.

"ఆపు — ఆపు...ఆ పనికాదు; ఇప్పుడు నువ్వు

### ఇరుగు

★ "మృచ్ఛకటిక" ఆధారంగా గిరీశ్ కర్నాడ్ నిర్మిస్తూ, దర్శకత్వం వహించే కన్నడ చిత్రంలో రేఖ నటించబోతోంది.

★ "జానీ జాన్ జనార్ధన్" అనే ముగ్గురు హీరోల హిందీ చిత్రం మన్‌మోహన్ దర్శకత్వంలో తయారవబోతోంది.

★ జె. వి. సోమయాజులు ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా మలేషియాకు వెళ్ళినప్పుడు ఒక రిస్ట్‌వాచ్‌ని సగం వెలకు కొనగలిగారు. ఒక కొట్టులోకి వెళ్ళగా, కొట్టతను ఆయన్ని గుర్తుపట్టి, పరమానందభరితుడయ్యాడు. తనవద్దున్న "శంకరాభరణం" పాటల టేప్‌ను వినిపించాడు. 250 డాలర్లు ఖరీదు చేసే రిస్ట్‌వాచ్‌ని 125 డాలర్లకే ఆయనకు విక్రయించాడట.

★ కిశోర్‌కుమార్ కొడుకు అమిత్‌కుమార్ తండ్రిని మించబోతున్నాడు. "లవ్ స్టోరీ"





'తల్లీ కొడుకుల అనుబంధం'లో
జయప్రద, కృష్ణంరాజా

## - పొరుగు



చిత్రంలోని అతని పాటలు హిట్స్ అయ్యాయి. ఇటీవల "బాయేన్-హాతికే ఖేల్" చిత్రంలో రాజేష్‌ఖన్నాకు, "నాస్తిక్, ఖుద్‌దార్" చిత్రాల్లో అమితాబ్‌బచ్చన్‌కు, "గజబ్"లో ధర్మేంద్రకు ప్లేబాక్ పాడాడు.

★ "ఇటీవల ఒక జ్యోతిష్కుడు నేను రాజకీయ రంగంలో కూడా ప్రవేశిస్తానని జోస్యం చెప్పాడు," అంది రాధిక. "వినడానికిది వింతగానే ఉండొచ్చు. కాని, నేను ఈవేళ ఒకటనుకుంటే, రేపు మరొకటి అనుకుంటాను. రాజకీయవేత్తల కుండే గుణమేగా ఇది?" అందామె నవ్వుతూ.

★ "శైకిసాన్" అనే రెండు రీళ్ళ డాక్యుమెంటరీని మనోజ్‌కుమార్ ప్రధాన పాత్ర ధరిస్తూ, నిర్మించాడు.

★ వారిస్‌ఖాన్ నిర్మించే చిత్రానికి నర్గీస్ స్మృత్యంజలిగా ఆమె పేరే పెట్టాడు.

బయలుదేరి మంగపతిగారింటికి వెళ్ళాలి ... నువ్వు బసవరాజుగారి అబ్బాయివని వాళ్ళతో చెప్తావు."

చంద్రం చేతిలోంచి స్పూన్ జారిపోయింది. "ఏమిటీ! మద్రాసు వచ్చినాక బ్రెయిన్ ఏమన్నా మారిపోయిందా? బసవరాజుగారి అబ్బాయి నువ్వు. నేను కాదు."

"గుర్తుంది కాని, ఇవేళ నుంచి నువ్వే వాళ్ళబ్బాయివి."

"ఏరా! నేను బుద్ధిమంతుడినని కనిపెట్టి – మీ నాన్న నన్ను దత్తత తీసుకుందాం – అనుకుంటు న్నాడేమిట్రా?"

"ఆఁ. మరే! ఆస్తంతా నీ పేరనే రాసేద్దా మనుకుంటున్నాడు. ఛీ! నోర్ముయ్ ... నువ్వు బసవరాజు అబ్బాయి గోపీలాగా ఈ ఊళ్ళో ఉన్న ఆ మంగపతిగారింటికి వెళ్ళి నటిస్తావ్. అంతే!" అంటూ గోపీ లేచి నిలుచున్నాడు.

తెరిచిన నోరు మూయకుండా చంద్రం కొన్ని క్షణాల వరకు అలాగే ఉండిపోయాడు.

పి. వి. సుబ్బారావు సమర్పణలో కిలారు బాబూరావు నిర్మించే బి. ఆర్. ప్రొడక్షన్స్ "అల్లుళ్ళొస్తున్నారు" చిత్రంలో గీత, సులక్షణ నాయికలు. ప్రభాకరరెడ్డి, చలం, పద్మనాభం, గిరిబాబు, మూన్ని ఇతర నటవర్గం. కె. వి. మహదేవన్ సంగీత దర్శకుడు. కె. వాసు దర్శకుడు.

## గిరిజా కల్యాణంలో స్టేషన్‌లో పరిచయం

విజయవాడ స్టేషన్ ... రాజగోపాలరావు (సత్యనారాయణ)ను పోర్టర్లు బల్లమీద పడుకో బెట్టారు. ఆయన్ని డాక్టర్ పరీక్షించి, ఇంజెక్షన్ ఇచ్చాడు. గిరిజ (జయప్రద), రవి (మాస్టర్ రాజా) ఆత్రుతగా చూస్తున్నారు. ఇంతలో ట్రెయిన్ బయలుదేరిన చప్పుడు వినిపించింది. గిరిజ లేచి వెళ్ళామనుకుంటే, ఆమె చేతిని రాజగోపాలరావు గట్టిగా పట్టుకొని ఉన్నాడు. రవి కిటికీ దగ్గరికెళ్ళి చూసొచ్చి, "అక్కా! ట్రెయిన్ వెళ్ళిపోయింది ఇప్పుడెట్లా?" అన్నాడు.

"ఏం చేస్తాం? తరువాత ట్రెయిన్‌కి వెళ్దాం," అంది గిరిజ నిట్టూరుస్తూ.

"ఈయన మీకు ఏమవుతారు?" అని డాక్టర్ అడిగాడు.

"అబ్బే ... వారితో మాకసలు పరిచయమే లేదండి. వారు బాధతో గిలగిలలాడుతూంటే, మీకు ఫోన్ చేయించాము," అంది గిరిజ.

రాజగోపాలరావు మెల్లగా కళ్ళు తెరిచాడు "ఈ అమ్మాయి మీ ప్రాణాలు కాపాడింది," అని డాక్టర్ చెప్తే, రాజగోపాలరావు కృతజ్ఞతగా చూస్తూ, "నీ పేరేమిటమ్మా?" అన్నాడు.

"గిరిజ."

"నా తల్లి పేరు కూడా గిరిజే. మీదే ఊరు?"

"ఈ ఊరేనండి."

"ఎక్కడికెళ్తున్నారు?"

"హైదరాబాదు."

"నేనూ హైదరాబాదే. అక్కడ మీకు బంధువులు ఉన్నారా?"

"లేరండి. వీడికి గుండె జబ్బు ఆపరేషన్ చేయిద్దామని తీసుకెళ్తున్నాను."

"అయ్యో, పాపం!" అంటూ రాజగోపాలరావు ముగ్గురికీ మూడు ఫస్టుక్లాసు టిక్కెట్లు గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో రిజర్వ్ చేసే ఏర్పాటు చేయించేసరికి గిరిజ "బాబుగారూ!" అంది కృతజ్ఞతతో.

రాజగోపాలరావు నవ్వాడు. ఆ నవ్వులో ఏదో బాధ ఉంది.

కె. ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో సుందర్‌లాల్ నహాతా సమర్పించే "గిరిజా కల్యాణం" చిత్రానికి శ్రీకాంత్ నహాతా నిర్మాత.

'అల్లుడుగారూ జిందాబాద్'లో శోభన్‌బాబు, గీత





'నాయుడుగారబ్బాయి'లో ఒక దృశ్యం



'బంగారు భూమి'లో కవిత, శ్రీదేవి

## సినిమా

### జతగాడులో ధనదాహం

బలరాం (నూతన్‌ప్రసాద్) సీరియస్‌గా ముఖం పెట్టి, "గోపి లక్ష్మిని గనక చేసుకుంటే, శాంతికి ఈ జన్మలో పెళ్ళి కాదు, మావయ్యా! శాంతీ, గోపీ కలిసి తిరగడం, చనువుగా మాట్లాడుకోవడం - నలుగురి కంటా పడింది. చిలక కొట్టిన పండును ఎవడు చేసుకుంటాడు చెప్పు!" అన్నాడు.

"మా నాయనే - మా నాయనే. ముత్యం లాంటి మాట చెప్పావురా, సుపుత్రా!" అంటూ కాంతం (గిరిజ) లక్ష్మీపతి (నాగభూషణం) వంక తిరిగి, "చూడన్నయ్యా! ఎంత చెడ్డా - మనం మనం ఒక తానుగుడ్డలం. ఒక తల్లి కన్నబిడ్డలం. నీ బాధ నా బాధ కాదా? నీ సుఖం నా సుఖం కాదా చెప్పు? అంచేత, కష్టమో - సుఖమో, అది నేను భరిస్తాను. శాంతిని మావాడికిచ్చి పెళ్ళి చేసెయ్యి. అన్నయ్యా, ఇంకేం ఆలోచించకు," అంది.

లక్ష్మీపతి లేచి, ఇనప్పెట్టె దగ్గరికి వెళ్ళి, అందులోంచి కొన్ని నోట్లకట్టలు తీశాడు. "శాంతిని, బలరాం కిచ్చి చెయ్యాలని నువ్వెందుకనుకుంటున్నావో నాకు తెలుసు, కాంతం! మీకు కావలసింది డబ్బయితే - తీసుకోండి. కాని, నా బిడ్డ పెళ్ళి ఆ గోపీతో జరిగితీరాలి. నలుగురికీ నా అల్లుడని నేను పరిచయం చేసిన మనిషి నా అల్లుడై తీరాలి. నా బిడ్డ కోరికను తీర్చితీరాలి. తీస్కోండి."

కాంతం డబ్బు పుచ్చుకుంటూ, "సరే, అన్నయ్యా! నువ్వింతగా పట్టుబడుతుంటే, నీ మాట కాదనగలమా? శాంతిని గోపీకిచ్చి పెళ్ళి చేద్దాం," అంది.

బలరాం ముఖం ప్రకాశవంతమైంది. "నువ్వింక ఈ విషయం మర్చిపో, మామయ్యా! గోపి, శాంతిని వద్దనడానికి కారణం లక్ష్మి. ఆ మెయిన్ స్విచ్‌ని ఆర్పేస్తే, ఈ బల్బు ఆరిపోతుంది."

ఇదంతా కిటికీగుండా గమనిస్తూన్న శాంతి (సంగీత)ను చూసి, లక్ష్మీపతి నిశ్చేష్టుడై పోయాడు.

బోయిన సుబ్బారావు దర్శకత్వంలో పి. వి. కృష్ణప్రసాద్ నిర్మించిన చందమామ పిక్చర్స్ "జతగాడు" చిత్రం ఆగస్టు విడుదల.



'రామాపురంలో సీత'లో సుజాత, రామకృష్ణ

### నివురుగప్పిన నిప్పు

"అక్టోబర్, డిసెంబర్ నెలల మధ్య షెడ్యూల్స్ ప్లాన్ చేశాం," అన్నారు పి. చిన్నపరెడ్డి ఈయన సమర్పణలో పి. చంద్రశేఖరరెడ్డి డైరెక్ట్ చేసే ఉష.శ్రీ క్రియేషన్స్‌వారి పై చిత్రంలో కృష్ణ, జయప్రద నాయకా నాయికలు ఉష:శ్రీ కథ, స్క్రీన్‌ప్లేకు మోదుకూరి జాన్సన్ సంభాషణలకర్త. మహదేవన్ సంగీతం, సుఖదేవ్ ఛాయతో పి. జె. ప్రభాకరరెడ్డి, ఎ. బి. రాజలింగం నిర్మాతలు.

'నేపాల్ గూఢచారి'లో పద్మప్రియ, రాజ్‌కుమార్



### రవి చిత్ర ఫిలిమ్స్ 12వ చిత్రం

"సెప్టెంబర్‌లో సాంగ్స్ రికార్డ్ చేస్తాం. అక్టోబర్ 8న షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు వై. వి. రావు. ఈయన "కర్మయోగి" హిందీ హిట్ చిత్రం ఆధారంగా కొమ్మినేని దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో ద్విపాత్రాభినయం నిర్వహించే కృష్ణంరాజు సరసన శారద, జయసుధ నాయికలు: శరత్‌బాబు, కవిత, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, సారథి, సిలోన్ మనోహర్, రమాప్రభ, జ్యోతిలక్ష్మి ఇంతవరకు ఎన్నికయ్యారు. గొల్లపూడి రచన, సత్యం సంగీతం, పి. దేవరాజ్ ఛాయ, బి. చలం శిల్పం, డి. రాజగోపాల్ కూర్పు తెరవెనుక హంగులు.

### శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్

కృష్ణతో నిర్మాత ఎన్. వి. సుబ్బరాజు త్వరలో ప్రారంభించే చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

# కవితాగానం చేసే కళ్లకు...

## ఐటెక్స్

అపురూప సౌందర్యంతో పొంగిపోయే
యవ్వనంతో మురిపించే వనితల వదనాలను
ఆకర్షించే అతివల కళ్లను, ఆనందంగా
కొనచూపులతో నటనమాడించేది ఐటెక్స్
శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ కాటుక అందాలు చిందేటి
యువతుల కళ్లను దోషమేమీ చేరనీయక
చల్లగా కాపాడుతుంది...

చూపులనే మాటలుగా మార్చే ఐటెక్స్

**ఐటెక్స్** 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం




అరవింద్ లాబొరేటరీస్ మద్రాసు 600033

Imageads-AL 1293 Tel

## ఎం. ఎస్. గోపీనాథ్ చిత్రం "నమ్మితే నమ్మండి"

"తెలుగు తమిళ భాషల్లో ఒకేసారి తీస్తున్నాము," అన్నారు దర్శక నిర్మాత ఎం. ఎస్. గోపీనాథ్. అనేక వందల ప్రదర్శనలిచ్చిన ఒక విశిష్టమైన తమిళ నాటకం ఆధారంగా తయారయ్యే "నమ్మితే నమ్మండి" చిత్రంలో ఒక ప్రముఖ నటునితోపాటు గోపీనాథ్ కొడుకు మాస్టర్ సురేష్ హీరో. తమిళ చిత్రంలోనూ శివాజీగణేశన్‌తో పాటు సురేష్ నటిస్తున్నాడు. ఈ స్ఫురద్రూపి "పన్నీరు పుష్పంగళ్" అనే తమిళ చిత్రంలో కథానాయకుడుగా చక్కగా నటించి, ప్రశంసలందుకున్నాడు. "ఫేల్ ఫేల్ మే" ఆధారంగా ఎస్. వి. ఆర్. ఫిలిమ్స్ తమిళంలో నిర్మించే చిత్రంలో ఋషికపూర్ పాత్రను ధరిస్తున్నాడు. జయశ్యామ్ దర్శకత్వం నెరపిన "కొత్త వెన్నెల"లో చాలా క్లిష్టమైన ప్రధాన భూమికను అత్యద్భుతంగా పోషించాడు. ఇంకా జయకాంతన్ చిత్రం "కరు", "కట్టిపతంగ్" తమిళ రూపాంతరం "నెంజిల్ ఓర్ ముళ్"లో హీరో. తండ్రి చిత్రంలో ఈ యువకుడు నటించడం ఇదే తొలిసారి. తమాషా ఏమిటంటే — ఈ అబ్బాయి తండ్రికి తెలియకుండా మొట్టమొదటిసారి ఒక చిత్రంలో బుక్ అయ్యాడు! ఆ విషయం చెప్తూ గోపీనాథ్, "అసలు మా అబ్బాయి హీరో అవుతాడని మేం కలలో కూడా అనుకోలేదు. 'రాముడు — పరశురాముడు' చిత్ర నిర్మాణంలో నాకు అసిస్ట్ చేయడానికి నాతోపాటు విదేశాలకు వచ్చాడు. సింగపూర్‌లో నటి రతికి మావాడు డైలాగ్‌లు చదివి వినిపిస్తూంటే, ఆటోగ్రాఫ్‌ల కోసం కొంత మంది యువతులు చుట్టుముట్టారు. రతి దగ్గర వాళ్ళు ఆటోగ్రాఫ్‌లు తీసుకున్నాక, మావాణ్ణి కూడా సంతకం పెట్టమని అడిగారు. అప్పుడు మావాడు



'నేనూ—మా ఆవిడ'లో చంద్రమోహన్, ప్రభ



'గిరిజా కళ్యాణం'లో శోభన్‌బాబు, జయప్రద

## సినిమా

తను ఆర్టిస్ట్ కాదని ఎంత చెప్పినా వాళ్ళు నమ్మలేదు. అప్పుడు రతి, ఆ ఇద్దరూ 'మీ నెక్స్‌ట్ పిక్చర్‌ను మీ సురేష్ హీరోగా తీయండి', అన్నారు. 'ఇప్పటికే మావాడి బి. ఎ. సెకెండ్ ఇయర్ చదువు పాడైంది. మద్రాసుకు చేరుకున్నాక వాడి చదువుమీద దృష్టి లగ్నం చేయవలసిందే', అన్నాను. కాని, వాళ్ళ మాటలు మావాడి మెదడులో పని చేసినట్లున్నాయి. మద్రాసు చేరుకున్న తర్వాత ఒకరోజు నా దగ్గరికి వచ్చి ఉన్నట్టుండి నమస్కరించి, 'నన్ను ఆశీర్వదించు నాన్నా! రేపు ఔట్‌డోర్ షూటింగ్‌కు ఊటీకి బయలుదేరుతున్నా', అన్నాడు. నిర్ఘాంతపోయాను. కె. ఛటర్జీగారు నిర్మించే 'జగమొండి' చిత్రంలో రాజ్యలక్ష్మి సరసన మావాడు నాకు తెలియకుండానే బుక్ అయిపోయాడు! నేను వెంటనే డైరెక్టర్ వి. మధుసూదనరావుగారికి ఫోన్ చేసి, 'ఇదేమిటండీ! మా సురేష్‌చేత ఏక్ట్ చేయిస్తున్నారా?' అన్నాను. 'మీవాడు చక్కని ఆర్టిస్టు. ఆ విషయం మీకు తెలియనిది కాదు; కాని, మొదటి అవకాశం మేం ఇస్తున్నాం,' అన్నారు. నేనింకా విస్మయం నుంచి తేరుకోలేదు. 'అది కాదండి. మా ఒక్కగాని కొడుకు — తల్లిదండ్రుల చాటున పెరిగిన బిడ్డ. మేమెవ్వరమూ తోడు లేనిదే పాండీబజార్ వైపు కూడా వెళ్ళడే! ఊటీకి ఒంటరిగా ఎలా పంపను?' అన్నాను. 'ఏం ఫరవాలేదు. నాకు మగ సంతానం లేదు. మీ అబ్బాయిని నా గదిలోనే ఉంచుకొని కంటికి రెప్పలా చూసుకుంటాను,' అంటూ ఆయన నచ్చజెప్పారు. ఇదీ ఒకందుకు మంచిదే. ఇతరుల చిత్రాల్లో మావాడు ప్రూవ్ చేసుకున్నాక నేను హీరో ఛాన్స్ ఇవ్వడమే సమంజసంగా ఉంటుంది 'జగమొండి' తర్వాత మావాణ్ణి కె. బాలచందర్ గారు 'రామదండు'లో బుక్ చేశారు," అన్నారు గోపీనాథ్ తర్వాత ఆయన 'సేఫ్' యూనియన్ గురించి వివరిస్తూ, "ఇంత కాలంగా చిత్ర రంగంలో సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న నిర్మాతలకు, పనివారలకు మధ్య సామరస్యాన్ని పెంపొందించడానికి శ్రీ బి. నాగిరెడ్డి వంటి ప్రముఖ చిత్ర పారిశ్రామికవేత్తల సహకారంతో, మద్దతుతో ప్రారంభించబడిన 'సేఫ్' ద్వారా తాతినేని ప్రకాశరావు, కె. బాలచందర్, దూండీ, యు. విశ్వేశ్వరరావు, మాధవన్, దొరై, శ్రీధర్, ఎస్. పి. ముత్తురామన్‌గార్లు చలనచిత్ర పరిశ్రమకు ఎనలేని సేవ చేస్తున్నారు," అన్నారు

## కె. వాసు దర్శకత్వంలో టి. వి. ఫిలిమ్స్ చిత్రం

"చంద్రమోహన్ హీరో, సరిత హీరోయిన్," అన్నారు కె. మహేంద్ర. ఈయన, వెంకటేశ్వర్లు సెప్టెంబర్‌లో ప్రారంభించే కొత్త చిత్రానికి కె. వాసు దర్శకుడు సత్యానంద్ సంభాషణలకర్త

## ప్రేమమందిరంలో భూగోళం పాఠం

చినరాజా రాజశేఖరం (ఎ. ఎన్. ఆర్.)కు పాఠాలు బోధించి వస్తూన్న ఆచారి (అల్లు రామలింగయ్య)ని చూసి భూపతి (గుమ్మడి) "ఊఁ... మీరు చినరాజావారికి ఏ రోజు ఏం పాఠాలు చెప్పారో మాతో చెప్పవలసిందిగా చెప్పాం కదా ? ఈ రోజు ఏం పాఠం చెప్పారు ?" అన్నాడు.

"భూగోళం గురించండి," అన్నాడు ఆచారి అతివినయంగా.

"ఏమని చెప్పారు ?"

"గందరగోళంగా ఉంటుందని చెప్పాను."

"ఏమైనా ప్రశ్నించారా ?"

"చిత్తం."

"దేన్నిగురించి ?"

"స్త్రీని గురించి."

"స్త్రీని గురించా ? వారు ప్రశ్నించారా ? ఏ విషయంలో ?"

"స్త్రీకి పురుషుడికి మధ్య తేడా ఏమిటని..."

"ఊఁ... మీరేం సమాధానం చెప్పారు ?"

"అయ్యా ! స్త్రీకి పురుషుడికి మధ్యనున్న భేదమల్లా స్పష్టే కదండీ ? అదే చెప్పాను.'

భూపతి తీక్షణంగా చూశాడు. ఆచారి తల వంచుకున్నాడు.

సురేష్ ప్రొడక్షన్స్ "ప్రేమ మందిరం" చిత్రాన్ని దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో డి. రామానాయుడు నిర్మిస్తున్నారు.

## హిందీ చిత్ర విచిత్రాలు

★ దేవ్ ఆనంద్ వద్ద ప్రొడక్షన్ మేనేజర్‌గా పనిచేసే రోజుల్లో అమిత్‌ఖాన్ అప్పుడప్పుడు కవితలల్లేవాడు. క్రమక్రమంగా కొన్ని చిత్రాలకు పాటలు రాసి, చివరికి "మన్ పసంద్" చిత్రాన్ని నిర్మించాడు. కొత్తగా "నయాజానీ" చిత్రాన్ని నిర్మించబోతున్నాడు. ఆగస్ట్ నుంచి మరో నిర్మాత తయారుచేసే చిత్రానికి దర్శకత్వం వహించబోతున్నాడు కూడా.

★ జె. ఓమ్‌ప్రకాశ్ సంస్థలో పనిచేసే ఉద్యోగులందరూ చిత్ర నిర్మాతలైపోయారు. మేనేజర్ అశోక్‌రాయ్, అక్కౌంటెంట్ జవహర్‌లాల్ బైనా, ఇతర గుమాస్తాలు వసంత్ దోషి, విజయ్ శర్మ, జగదీశ్‌కుమార్, విమల్‌కుమార్ చిత్ర నిర్మాతల జాబితాలో చేరిపోయారు.

★ "నసీబ్" చిత్రాన్ని ఢిల్లీ ప్రాంతంలో పంపిణీకి తీసుకున్న ఫిలిమ్ ఏంజిల్స్ సంస్థ అధినేత నరేందర్‌కుమార్ ఇంతవరకు ఆ చిత్రాన్ని చూడలేదట.

★ హిందీ నటుడు రాజ్‌కుమార్ కొడుకును ఎత్తుకుపోవడానికి ప్రయత్నించి విఫలుడైనట్లు ధిల్లా ఇటీవల ఒక బొంబాయి పత్రికా విలేఖరికి తెలియజేశాడు.

★ మొఘలాయీ చరిత్రలో ఢిల్లీ రాజధానిగా రజియాసుల్తానా సామ్రాజ్యాన్ని కంటికి రెప్పలా చూసుకుంది. ఆ వీరవనిత మీద కమల్ అమ్రోహి రూపొందించిన చిత్రాన్ని ప్రధాని ఇందిరాగాంధీ పుట్టిన రోజున (19 నవంబర్) విడుదల చేయడానికి నిశ్చయించాడు.

★ "క్రాంతి" చిత్రాన్ని మనోజ్‌కుమార్ తెలుగు, తమిళ భాషల్లో డబ్ చేస్తాడట. ఇతను ఆగస్ట్‌లో ప్రారంభించే "పెయింటర్ బాబు" చిత్రంలో రాజీవ్ గోస్వామి, శశికళ శేషాద్రి, బీన అనే కొత్త తారలను, జగదీశ్ అనే కొత్త సంగీత దర్శకుణ్ని పరిచయం చెయ్యబోతున్నాడు.

★ "గాంధీజీ" మీద చిత్రం తయారుచేస్తూన్న రిచర్డ్ ఆటెన్‌బరో వర్ణభేదం చూపుతూ, యూనిట్‌లో పనిచేసే భారతీయ సాంకేతిక నిపుణులకు తక్కువ పారితోషికాలు ఇవ్వడమే కాకుండా చులకనగా చూస్తున్నాడని పార్లమెంట్‌లో ఇద్దరు కాంగ్రెస్ (ఐ) సభ్యులు చేసిన ఫిర్యాదుల ఫలితంగా ఆ చిత్ర నిర్మాణంలో పర్యవేక్షకుడుగా పునే ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన అసిస్టెంట్ ప్రొఫెసర్ ఎ. ప్రతాప్‌ను కేంద్ర ప్రభుత్వం నియమించింది.

★ ఫలానా చిత్రం హిట్ అవుతుందనో, ఫ్లాప్ అవుతుందనో హిందీ గేయ కవి ఆనంద్‌బక్షి జోస్యం చెప్పడం మామూలు. అతని నోటి వాక్యం ప్రకారం "లవ్ స్టోరీ, నసీబ్, ఏక్ దుజేకే లియే" హిట్స్ అయ్యాయి. ఇటీవలే అతను చిత్ర నిర్మాత అయ్యాడు. అతని చిత్రం ఎలా పోతుందో మరి!



# సి ని మా

## రామాపురంలో సీతలా మురళి ఇంట్లో జ్యోతి

సీత (సుజాత) హారతి పళ్ళెంతో మురళి (రామకృష్ణ) దగ్గరికొచ్చింది.

"హారతి ఎవరికి సీతా ?"

"నాకు వరమిచ్చిన దేవుళ్ళకు. నన్ను కనికరించిన దేవుడికి."

"నీ దేవుడికి నువ్వు హారతులిచ్చావు. మరి నా కోసం దిగివచ్చిన దేవతకు నేనేమివ్వాలి ?" అంటూ మురళి హారతి పళ్ళెంలోంచి కుంకుమతీసి, సీత నుదుట దిద్ది, "మహాలక్ష్మిలా ఈ ఇంట్లో అడుగుపెట్టావు. నిన్నెప్పుడూ ఇలాగే చూస్తూండిపోవాలనుంది," అన్నాడు.

"నేనంత గొప్పదాన్ని కాదు."

"సీతా, మా అమ్మ బ్రతికుండగా ఈ పూజా

'మావూరి పెద్దమనుషులు'లో జ్యోతి



మందిరంలో జ్యోతి ఎప్పుడూ వెలుగుతూండేదట. ఇల్లు కళకళలాడుతూండేదట. అమ్మ పోయింది. ఈ ఇల్లు వెలవెలపోయింది. నువ్వొచ్చావు. ఈ ఇంటికి వెలుగొచ్చింది. నువ్వు వెలిగించిన వెలుగులో ఈ ఇల్లు ఎప్పుడూ కళకళలాడుతూ ఉండాలి."

"నా బ్రతుకు మోడులాగా మిగిలిపోతుందని అనుకున్నాను. నా బ్రతుకులోకి మీరొచ్చారు. నేను బ్రతికినంత కాలం మీ సేవలు చేస్తూ, ముత్తయిదువుగా మీ చేతుల్లో వెళ్ళిపోవాలనుంది."

"సీతా, ఈ ఇంటి గృహలక్ష్మి ఎప్పుడూ కంటతడి పెట్టకూడదు ... ఈ ఇంటి గౌరవం గడప దాటకుండా, ఏ కష్టమూ లేకుండా – ఈ ఇంట్లోనే సంతోషంగా జీవించాలి. నీకు నేనూ... నాకు నువ్వూ ..." అంటూ మురళి, ఆమెను దగ్గరికి తీసుకున్నాడు.

రామకృష్ణ సమర్పించే ఆర్. కె. మూవీస్ "రామాపురంలో సీత" చిత్రాన్ని ధవళ సత్యం స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో జి. శ్రీనివాస్, జి. గణేశన్ నిర్మించారు. 

300
గ్రాములు
రూ. 3·20
(స్థానిక పన్నులు అదనం)

మీకు మీరుగాగమనించండి!

# ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ. ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్




## మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది.
మరియు అధికమైన శుభ్రపరిచే నీలి
డిటర్జెంట్ శక్తి ఉన్నది.
మరి ఇంకేమి? పొదుపుగ
ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన
భాగాలు కలిగివుంది.

## కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు
కలదానికి మీరు ఎంత ఖర్చుపెడుతున్నారు?
250 గ్రాముల "టోటల్" ధర కేవలం రూ. 2.67.
(300 గ్రాములకి రూ. 3.20). అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న
రెండు రెట్లు బరువు ఎక్కువ. కేవలం కొద్ది పైసల హెచ్చుకే!

ఉతుకుటకు
చేతికనువుగా
ఐదు భాగాలు.

## ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియుతమిళనాడులలో దొరుకును.

కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్,బెంగుళూరు వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు: మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు.

MCA-TDB-51-Tel

సీరియల్

# రాగజ్వాల

చిట్టారెడ్డి సూర్యకుమారి

ఆ రోజు మల్లమ్మ విందు భోజనం చేసింది. ఆ రాత్రి సుందర్, వసుంధర మూర్తి ల మధ్య పడుకుని హాయిగా, కమ్మగా నిద్రపోయాడు.

సుందర్ మీదుగా వసుంధరను చూశాడు మూర్తి. చిన్నగా నవ్వి కిటికీలోంచి బయటికి చూసింది వసుంధర. ఆకాశాన చంద్రుడు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు.

మల్లమ్మ ''అమ్మా'' అని మెల్లగా పిలిచింది వసుంధర లేచి వెళ్లింది. మరికాసేపటికి ''బాబు'' అని వచ్చి పిలిచింది. మూర్తి మల్లమ్మవైపు చూశాడు. అవతల గదివైపు చూపింది నవ్వుతూ.

''అక్కడ ఏముందో ?'' అనుకుంటూ వెళ్లాడు ఆ గదిలోకి చూసి అప్రతిభుడై నిలుచుండిపోయాడు. మల్లమ్మ తన గదిని శోభనపు గదిగా అలంకరించింది. వెన్నెలను పట్టి ఆ గదిలో పరిచిందా అనిపిస్తుంది. మల్లెల సౌరభం గదినుంచి బయటికి పోవాలని చూస్తోంది. అంతకంటే తెల్లని మనస్సుగల ధవళాక్షి వసుంధర తనవైపు చూస్తోంది. మెల్లగా తలుపులు వేసి — మెత్తగా వచ్చి — వసుంధర చుబుకం పట్టి — ముఖాన్ని తన వైపుకు తిప్పుకున్నాడు.

''ఆలుమగల మధ్య దాపరికం ఏమి వుండకూడదంటారు ...'' మంచంపై కూర్చోబెట్టి —

''వసూ ! నాకో చెడ్డ గుణం వుంది ...''

వసుంధర అతని కళ్లల్లోకి చూసింది.

''నా భార్య నన్నే ప్రేమించాలని — నన్ను తప్ప మరొకరిని ప్రేమించకూడదు. నా భార్య తనువుల్లో, వూహల్లో నేనే నిండిపోవాలని ... అది నా స్వార్థమే అను — నేను చెడ్డవాణ్ణి కదూ ... అలా ప్రేమించగలిగితేనే ...'' కళ్లల్లోకి చూసి నవ్వాడు. చేతులు చాచాడు. మరో ఆలోచన లేకుండా చేతుల్లో వాలిపోయింది.

తన అర్థాంగిని హృదయానికి చేర్చుకుని, ''నన్ను ఎప్పటినుంచి ప్రేమిస్తున్నావ్ ?'' అని ప్రశ్నించాడు.

''..............''

''పెళ్ళయిన దగ్గరినుండి కదూ ...''

వసుంధర తల వూపింది. ఆ తలను పట్టి,

''వసూ ! నేను నిన్ను చూసినప్పటిమంచి ప్రేమిస్తూనే వున్నాను. నిన్ను చూడక ముందు నిన్ను ద్వేషించాను ...''

హృదయం మీదనుంచి తొలగి, అతనివైపు ప్రశ్నార్థకంగా చూసింది.

## (గత సంచిక తరువాయి)

''అవును వసూ ... నేను ఎవరో తెలిస్తే నీకు కోపం రాదుగా ? నేను రమ్య తమ్ముడు విష్ణును. ఆశ్చర్యంగా వుందా ? రమ్య కోసం వచ్చాను. రమ్య లేదు. పిచ్చివాడై పిచ్చిచూపులు చూస్తున్న శ్రీకాంత్‌ను కలుసుకున్నాను. సంగతులు తెలుసుకున్నాను. రమ్య కోసం వెతికాను. తిరిగి వచ్చి చూస్తే శ్రీకాంత్ కూడా లేడు. వారి ప్రేమ ఎంత ఘాటైనదో నాకు తెలుసు. రమ్య అంటే నాకు చాలా ఇష్టం. అక్కా, తమ్ముడిలాగకాక స్నేహితుల్లా, అన్నా, తమ్ముళ్లా తన్నుకునేవాళ్లం. రమ్య కొడుకును వెతుకుతూ నీ దగ్గరకు వచ్చాను. నీవు వాణ్ని చూసే విధం — నీ మంచి, నీ పోర్పు — చూశాను. నాకు తెలియకుండానే నిన్ను అభిమానించాను. ఆ తర్వాత ప్రేమించాను. ఆ తర్వాత సంగతి నీకు తెలిసిందే. మెల్లగా రాణీగారి కోటలో పాగా వేశాను ...''

వసుంధర నిట్టూర్చింది.

''ఏమిటి నిట్టూర్చుతున్నావ్ ?''

''బాబోయ్ నీతో కాపురం కష్టమే. తుమ్మినా, దగ్గినా నీతో చెప్పాలి కాబోలు. ఇన్ని రోజుల బరువు తీర్చుకుంటూ ఇక భయం లేదని—సుందర్ విషయంలో నీ ప్రేమ మారదని, నీ నీడలో మేమిద్దరం హాయిగా విశ్రమించవచ్చని తృప్తిగా నిట్టూర్చాను. నా ఎక్స్‌ప్లనేషన్ సరిపోయిందా ?''

''నా కంతా సరిపోయింది. నేను నీకు సరిపోయానా ? అనే విషయమే తేలలేదు. ఇన్నాళ్లు నీవు ఎదురు చూసే రాజకుమారుడ్ని నేనేనా...?!''

వేరే చెప్పాలా అన్నట్లుగా అతని కౌగిలిలో ఒదిగిపోయింది.

వారి మధ్య నుంచి పోవాలని చూసిన వూదొత్తి ధూమం — పోలేక ప్రక్కనుంచి తప్పుకుంది. ఆ నవ దంపతులకు ఏకాంతం కలిగిస్తూ చంద్రుడు మబ్బు చాటుకు చేరుకున్నాడు.

* * *

వినా వేంకటేశం ననాథో ననాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి—
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ

'రక్షించు, రక్షించు' అంటూ పూజా మందిరంలో మోకాళ్లాని ప్రార్థిస్తున్న ఆమెను, ఓ యాభై జతల కళ్లు విప్పార్చి చూస్తున్నాయి. ఆమె ప్రార్థన ముగించి మందిరం నుంచి బయటికి రాగానే ''అమ్మగారు, అమ్మగారు'' అంటూ కొందరు, ''అమ్మా! అమ్మా!'' అంటూ కొందరు, ''టీచర్, టీచర్'' అంటూ మరి కొందరు — అలా అందరూ ఆమె చుట్టూ చేరారు.

అది బాలబాలికల అనాథాశ్రమము. ఓ పల్లెలో దూరంగా దాదాపు అడవి ప్రదేశంలో వుంది. ఒక ప్రక్క నల్లమలై కొండలు — కోట గోడల్లా బారులు తీర్చివున్నాయి.

ఆశ్రమంలో పనిచేస్తున్న టీచర్ — రమ్య అంటే ఆ పిల్లలకి ప్రాణం. తక్కిన ఉద్యోగస్తుల్లా వేరేగా వుండదు. ప్రత్యేకంగా వండుకొని తినదు వేరేగా వూర్లో ఇల్లు తీసుకుని వుండదు. వారితో వుంటూ, వారితో తింటూ, వారి మధ్యనే పడుకునే ఆమె వారికి తల్లి లాంటిది. ఒకరిద్దరికి కాదు. సుమారు ముప్పైమందికి తల్లి లాంటిది.

సంవత్సరానికి ఒకరోజు ఆమె తలలో పూలు పెట్టుకుని, నుదుట కుంకుమ దిద్దుకుని, కొత్త చీర కట్టుకుని -- ప్రార్థనానంతరం పిల్లలకి మిఠాయిలు పంచుతుంది. ఏ పండుగలు ఆ పిల్లలకు గుర్తు వుండదు. అమ్మ తలలో పూలు ముడిచినరోజు వారికి పండుగ. సంవత్సరంలో ఆ

**జరిగిన కథ—10 :** నాగయ్య, అమరేశ్వరిలకు ముగ్గురు కూతుళ్లు, ఒక్క కొడుకు విష్ణు. పెద్ద కూతుళ్లిద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. మూడవ కూతురు రమ్య, ఎదురింటి శ్రీకాంత్ ప్రేమించుకొంటారు. వాళ్లొకరోజు లేచిపోయి గుళ్ళో పెళ్లి చేసుకొని, కొత్త జీవితం ప్రారంభిస్తారు. ఇంటి యజమాని వెంకట్రావ్ భార్య సుగుణ రమ్యను తన సొంత చెల్లెలుగా చూసుకొంటుంటుంది రమ్యకు గర్భం వస్తుంది. ఈ వార్త పిల్లలు పుట్టని సుగుణకు బాధ కలిగిస్తుంది. కానీ ఆమె కూడా గర్భవతి అవుతుంది. వెంకట్రావ్‌కు కూతురు పుడుతుంది. శ్రీకాంత్ చిన్ననాటి స్నేహితురాలు డా॥ వసుంధర అతనితో అంత క్లోజ్‌గా ఉండడం సహించలేకపోతుంది రమ్య. రమ్య కొడుకు సుందర్‌కి ఓ రోజు జబ్బుచేస్తే వసుంధరే ఆదుకొంటుంది. అప్పట్నుంచి వసుంధరను చేరదీస్తుంది రమ్య. వసుంధర శ్రీకాంత్‌ను తనవాడిగా చేసుకోవటానికి ప్రయత్నిస్తుంటుంది. తన వాడనుకొన్న శ్రీకాంత్ వసుంధర సొంతమైనాడని అనుమానించిన రమ్య, బాబుని వసుంధరకు అప్పగించి ఎటో వెళ్లిపోతుంది. శ్రీకాంత్ ఆ షాక్ నుంచి తేరుకొని తన దగ్గరకు వస్తాడన్న ఆశతో ఎదురు చూస్తుంటుంది వసుంధర. ఆమెకు వుత్తరం ద్వారా తెల్పి శ్రీకాంత్ కూడా ఎటో వెళ్లిపోతాడు. మెడికల్ రిప్రజెంటేటివ్ మూర్తి వసుంధర ఇంట్లో అద్దెకు దిగుతాడు. అతనితో చనువుగా వుంటుంటాడు సుందర్. సుందర్ తన గర్ల్ ఫ్రెండ్ లల్లీకి ఇల్లు మొత్తం చూపిస్తాడు. లల్లీలో తన తండ్రి మూర్తేనని అబద్ధం చెప్పి, మూర్తిని వప్పించుతాడు. ఫైర్ ఆక్సిడెంట్‌కి గురైన వసుంధరను రక్షించుతాడు మూర్తి. అతనితో వసుంధర పెళ్లి జరిపించుతుంది ఆమె మేనత్త.

రోజు కోసం ఎదురు చూస్తారు. రమ్యను ముట్టుకుంటే చాలు వారు సంతోషించిపోతారు.

ఏమిటి విశేషం అని కొత్తలో తోటి వుద్యోగస్థులు అడిగేవారు – చిరునవ్వే సమాధానం. ఆ రోజు తన పెళ్ళిరోజని ఎవ్వరికి చెప్పలేకపోయేది.

ఆ రోజు ఆస్పత్రినుంచి – నేరుగా స్టేషన్‌కు వచ్చి – ఆగివున్న రైలులో ఎక్కేసింది. సుందర్‌ని వదిలి వచ్చేయటంలో మనసు మొద్దుబారిపోయింది. రైలు పెట్టెలో టికెట్ కలెక్టర్ తట్టి – టికెట్ అడిగేదాకా తను పోతున్న రైలులో వుందని గ్రహించలేదు.

టికెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్నందుకు, కూర్చున్న చోటునుండి లేపి ద్వారం ప్రక్కన నిల్చోబెట్టి – 'వచ్చే స్టేషన్‌లో దిగిపొండి లేదా...' తరువాత ఏమి చెప్పాడో తనకు వినబడలేదు. దిక్కు తోచలేదు. మనస్సుకు శరీరానికి ఏ బాధలేనట్లు తిమ్మిరెక్కిపోయింది. తనను అక్కడ నిల్చోబెట్టిన టి. సి. తిరిగి ఆ కంపార్టుమెంటులోకి రాలేదు. ఎంతసేపు అలా నిల్చుందో తెలియదు. మనస్సులో చీకటి, చుట్టూ చీకటి. రైలు ఆగింది. తలుపులు తీశారు. ఎవ్వరూ మళ్ళీ మూయలేదు. ఆగిన రైలు వున్నట్టుండి కుదుపిచ్చింది. తను చీకట్లోకి పడిపోవటం వరకే తనకు తెలుసు.

తరువాత తెలివి వచ్చింది. ప్లాట్‌ఫాంమీద పడిపోయిన తనను, ఒక ధర్మదాత ఆసుపత్రిలో చేర్చాడు. అతను తనెక్కిన కంపార్టుమెంటులో వున్నాడు. తనను గమనిస్తూనే వున్నాడట. ఆ విషయాలన్నీ చెప్పాడు. గాయాలు మానాయి. ఒకసారి స్థంభించిన మస్తిష్కం మళ్ళీ పనిచేయటం ప్రారంభించింది. అప్పుడే ఎందుకు చనిపోలేదు అని ఏడుస్తున్న తనను, తనని కాపాడిన వృద్ధుడు – "దేవుడు బ్రతకమని ఇచ్చిన విలువైన జీవితాన్ని వృధా చేయకూడదు. సృష్టిలో ఏది వ్యర్థం కారాదు. చివరికి రాలిపోయిన పండుటాకు కూడా వుపయోగపడుతుంది. దేవుడి విలువైన సృష్టి మనిషి. తన విలువైన కాలాన్ని వ్యర్థపుచ్చకూడదు. పనికి రాకుండా పోకూడదు. నీవు నీ కొడుక్కి దూరం అయ్యావు – నీ మనస్సు గట్టి చేసుకో. ఎందరికో తల్లివి కాగలవు. తల్లిప్రేమ కరువైన అనాథ పిల్లలకు నీ ప్రేమను పంచు – నీవు పోగొట్టుకుంది వారి దగ్గర నీకు దొరుకుతుంది" అని చక్కగా మంచి మాటలతో హృదయాన్ని చల్లబరచి – ఆ ఆశ్రమానికి తెచ్చి – దిక్కులేని పిల్లలను చూపించాడు.

ఆ ఆశ్రమం ప్రభుత్వం నడుపుతోంది. వారిచ్చే డబ్బుతో – ఆ పిల్లల కడుపు నిండదు. గుడ్డ, గూడు, వసతుల సంగతి – తలంచనే కూడదు. సరైన పోషక ఆహారం లేక కొందరికి గుడ్డితనం వచ్చింది. కొందరికి క్షయ వుంటే–మరి కొందరికి కుష్టువుంది. మిగిలినవారు వికారంగా వున్నారు. రమ్య వారిని చూసి భయపడింది. తన కొడుక్కి వున్న గుండెజబ్బు సంగతి విస్మరించింది. కోడిపెట్ట పిల్లలను రెక్కల క్రిందికి చేర్చుకున్నట్లు – వారిని తన చేతుల్లోకి తీసుకుంది.

రమ్య స్వతహాగా చురుకైనది, తెలివిగలది. సంఘ సేవకుల సహాయంతో మరికొన్ని ధర్మ సంస్థల నుంచి సహాయం అడిగింది. ధర్మాత్ములకు కొదవలేని దేశవాసుల సహాయంతో వారికి కావలసిన వసతులు యేర్పాటు చేసింది. ప్రభుత్వంవారు గుర్తించి, ఆ ఆశ్రమానికి మరికొంత అదనంగా సహాయాన్ని అందించారు. ఆ పిల్లలకు ఇప్పుడు వైద్య సహాయం, విద్య పుష్కలంగా లభిస్తోంది. వున్నంతలో ఆహారం పూట పూటకు దొరుకుతోంది. ఆ విధంగా ఆ తల్లి కన్న సన్నంలో సేద తీరుతున్నారు.

ఆ అడవిలో – ఆ పిల్లల మధ్య – కాలం ఎలా గడిచిపోయిందో – తనకే తెలియదు. రోజులు లెక్క పెట్టుకోకుండానే ఇట్టే సంవత్సరం గడిచిపోయింది. సంవత్సరాలు గడుస్తున్నా పాత జ్ఞాపకాలు కొత్తగా తొలుస్తుండేవి.

తన సుందర్ ఎలా వున్నాడు? బ్రతికేవున్నాడా? వుంటే ఎంతవాడై వుంటాడు? ఆ పిల్లల్లో సుందర్‌ని వెతుక్కునేది. శ్రీకాంత్‌ను జ్ఞాపకాలనుంచి పారద్రోలేది. మరింకేదో పని కల్పించుకునేది. ఒక్కొక్కసారి నిద్రలో వులిక్కిపడి లేచేది. కాంతి తనను ముద్దు పెట్టుకుని తట్టి లేపినట్లు వుండేది. "కాంతి ... నన్ను విడిచి వుండలేవన్నావు. ఇప్పుడు ఆమెతో కాపురం చేస్తూ, గొప్పగా బ్రతుకుతున్నావా? కాంతి – కాంతి! నాతో గడిపిన క్షణాలైనా గుర్తుకు రావట్లేదా?" అనుకునేది – తపించేది – మనస్సు శ్రీకాంత్‌నే జపిస్తూ తపస్సు చేసేది.

పిల్లలు శుభ్రంగా వుతికిన బట్టలు వేసుకున్నారు. వుత్సాహంగా వున్నారు. మొట్టమొదటిసారిగా బయటి ప్రపంచాన్ని చూడటానికి పోతున్నారు. విజ్ఞానయాత్రకి పోవటానికి కొంత డబ్బు ప్రభుత్వం ద్వారా శాంక్షన్ అయివచ్చింది. మరొక దాత బస్సు ఏర్పాటు చేశాడు. లేడీస్ క్లబ్‌వాళ్ళు –ఎక్స్‌కర్షన్‌లో వున్నన్ని రోజులు–వారికి అయ్యే తిండి ఖర్చులు భరిస్తామన్నారు. ఆ రోజే ప్రయాణమైవారు. చలో హైదరాబాద్ అన్నారు. కొంతమంది టీచర్స్ హోమ్‌లో పనిచేసేవాళ్ళు పిల్లలతో బయలుదేరారు.

వారితో 'రమ్య' రానందుకు వెలితిగా వున్నా, ప్రయాణంలో వుండే వుత్సాహం వారిని నిల్వనీయటం లేదు. వారికున్న ఒకటి రెండు బట్టలు సర్దుకున్నారు. వారిని జాగ్రత్తగా వుండమని చెప్పింది. తలలు తాటికాయల్లా వూపి ఆగిన బస్సులోకి ఎక్కేస్తున్నారు. హాలులాంటి గదిలో కిటికీ దగ్గర నిల్చుంది. బయట హడావుడి వినిపిస్తూనేవుంది. ఆ రోజు తన పెళ్ళిరోజు. మిగిలిన మధురస్మృతులు బాధిస్తున్నాయి. పదే పదే శ్రీకాంత్ గుర్తుకు వస్తున్నాడు. చేతులు చాచి తనను పిలుస్తున్నట్లే వుంది. పిల్లలందరూ వెళ్ళిపోతే ఒంటరిగా అక్కడ వుండలేననుకుంది. బస్సు హారన్ కొట్టింది.



బయటికి వచ్చింది. పిల్లలు చేతులు వూపుతున్నారు. బస్సు కదిలింది. పరుగున వచ్చి బస్సులో ఎక్కేసింది. పిల్లలు సంతోషంతో అరచిన అరుపులు బస్సులో ప్రతిధ్వనించాయి.

బస్సు పోతూంది. ఆశ్రమంలో అడుగుపెట్టిన తర్వాత బయటికి రావడం అదే మొదటిసారి. బస్సు మిట్ట పల్లాలమీద పోతూంది. కొండ ఎక్కింది, దిగింది. లోయలు దాటింది. ఎన్నో మలుపులు తిరుగుతోంది. రమ్య కళ్ళు మూసుకుంది. తన బాల్యం గుర్తుకు వచ్చింది. అంతా నిన్న మొన్నటి లాగ వుంది. అయినా అప్పుడే తన జీవితం సమాప్తి అయ్యింది. ఫుల్‌స్టాప్ పెట్టేసింది. అప్పుడే తన బ్రతుకు ఆగిపోయిందా ?

అమ్మా, నాన్నలు ఎలా వున్నారో — బ్రతికే వున్నారా ? బ్రతికే వుండాలి — నిండా నూరేళ్ళ జీవితం వారికి వుండాలి. చనిపోయేంత వరకు భార్యా భర్తలు కలిసి వుండటం — అదృష్టం. మాలతి, మాధవిలు ఏం చేస్తున్నారో ? ఇంకా ఆ గదిలోనే కాలక్షేపం చేస్తున్నారా? లేక పెళ్ళిళ్ళు చేసుకున్నారా?

అందరి కంటే చిన్నవాడు విష్ణు. ఎంతగా అప్పుడే మునగచెట్టులా బరబరమని ఎదిగిపోయాడు. మగ మహారాజు -- మగాడై వుంటాడు. వుద్యోగం చేస్తున్నాడా ? లేక సినిమాలే చూస్తున్నాడో — వాన్న ఇల్లుమీద ఇల్లు కట్టాడా లేక, ప్లాను వేయటంలోనే వున్నాడా ? శుభ కాంతి చెల్లెలికి పెళ్ళి అయ్యిందా ? పద్మావతమ్మ ఇప్పుడు సంతోషంగా వుండి వుంటుంది. డాక్టరు—గొప్పింటి పిల్ల కోడలుగా వచ్చిందిగా — కొడుకును క్షమించేసి వుంటుంది. అలా ఒక్కొక్కరిని చూడాలనిపించింది. కాంతిని ఒకసారి కళ్ళారా చూడాలని, సుందర్‌ని ఒకసారి కౌగిలించుకోవాలని — పిచ్చి కోరిక కలిగింది. కన్నులు చెమ్మగిల్లాయి--ఏమిటి ... కోరిక ఇంత బలంగా వుంది. అప్పుడే ప్రాణం పోతుందా ? ఇలా నిలవిలలాడుతోంది.

చివరికి సుగుణక్క, బావగారు గుర్తుకు వచ్చారు. ఒకసారి కొంతమంది ఆఫీసర్లతో బావగారు ఆశ్రమాన్ని చూడటానికి వచ్చారు. తను వారికంట కనబడకుండా దాక్కుంది. ఎదుటపడి వారి

## రా గ జ్వా ల

యోగక్షేమాలు తెలుసుకుందామన్న కోరికను అణచి వేసుకుంది. తన పుట్టిల్లు—తనవాళ్ళు రెండొందల మైళ్ళ దూరంలోనే వుండేది. కాని తను పోలేదు — పోకుండానే సంవత్సరాలు ఇట్టే గడిచిపోయాయి.

బస్సు జూలాజికల్ పార్కులోకి వెళ్ళింది. పిల్లలు బిలబిలమంటూ దిగిపోయారు. సూర్యుడు పశ్చిమాకాశంలో నిలిచాడు. రమ్య ఒక్కతే బస్సులో కూర్చుంది. మరి కూర్చోలేకపోయింది. మరో టీచర్‌కి చెప్పి బయటికి వచ్చింది.

రమ్య మనస్సు మనస్సులో లేదు. ఎక్కడో విహరిస్తూంది. శరీరం ఏం చేస్తుందో మనస్సుకు తెలియదు. మనస్సు చెప్పింది శరీరం వినటం లేదు. అంటే తనకు తెలియకుండానే పార్కులోకి వచ్చింది. పార్కులోకి అడుగు పెట్టగానే — పూర్వ జన్మ గుర్తుకు వచ్చినదానిలా — వడివడిగా కాంతిని నిత్యము కలుసుకునే చెట్టు దగ్గరకు వచ్చింది — అక్కడ కూర్చోవాలని — ఆ స్థలాన్ని ముద్దు పెట్టుకోవాలని — వురకలు వేస్తూ వచ్చింది. కాని ఆ చెట్టు క్రింద వేమనలా కూర్చున్న వ్యక్తిని చూసి టక్కున ఆగిపోయింది.

అంతవరకూ తల వంచుకున్న వ్యక్తి చప్పున తలెత్తి చూశాడు — ఆ వ్యక్తిని చూసిన రమ్య గాలిని పీల్చటం మానేసింది. రెప్పపాటు లేకుండా చూసింది. అతను... కన్నార్పితే ఎదుటి వ్యక్తి అదృశ్యమై పోతుందా అన్నట్లుగా కళ్ళు విప్పారించాడు. కదిలితే మెలకువ వస్తుందేమో! కల చెదిరిపోతుందేమో అన్నట్లుగ కదలక బిగుసుకుపోయాడు. అలా ఒకరి నొకరు చూసుకుంటూ వుండిపోయారు. కాలం ఆగిపోయింది. తన గుండె ఆగిపోతుందేమో అనిపించింది రమ్యకు. అతని పెదవులు మెల్లగ 'రమ్యా' అన్నట్లుగ కదిలాయి. స్వరం పైకి రాలేదు. కాంతీ, కాంతీ — తన కాంతి కనుపిస్తున్నాడు — ఇది కల కాదు — ఒక్కసారి, రక్తం పైకి పొంగింది. కూర్చున్న శ్రీకాంత్ తడబడుతూ లేచాడు. చూపులు రమ్యనుండి మరలటంలేదు.



తన తపస్సు ఫలించిందా ! దేవుడు వర మిచ్చాడా ! భగవాన్ ఆశ నిరాశ చేయకు. ఇది కల్పనే — అయినా భ్రమ అయితే ఇక నేను బ్రతకను. నిరీక్షణలో వున్న వేదనకు ఇక నా గుండె తట్టుకో లేదు. ఈ క్షణం నిజం కావాలి. భగవాన్ ! నీవు వున్నావు — నీవు నీ రూపంతో సృష్టించిన మనిషికి ఎంత శక్తి నిగూఢమై వుందో అతనికి తెలియదు. మనసా వాచా దేవుణ్ని వేడుకుంటూ—రమ్య...రమ్య అని హృదయంలో పిలుపుకున్నాడు. ప్రొద్దుటనుంచి అక్కడే, అలాగే కూర్చున్నాడు. రమ్యను వెతికి వేసారిపోయాడు. ఇక అక్కడ నుండి కదలకూడదని శపథం చేసుకుని కూర్చున్నాడు. తన రమ్య...తన ప్రాణం కదలివచ్చింది. నడచివచ్చి తనెదుట నిలిచింది. మనిషి ప్రేమకు అంత శక్తివుందా! సూర్య గమనాన్ని ఆపగలిగిన మనిషి — తన భార్యను రప్పించుకోలేడా ? అని తలచాడు. తన పిలుపు వినింది వెతుక్కుంటూ వచ్చింది. ఇంతకంటే నిదర్శనం ఏమికావాలి ? తన రమ్య తనను మరచి పోలేదు. తనను ప్రేమించటం మానలేదు.

"రమ్యా!"చేతులు చాస్తూ ముందుకువచ్చాడు. శ్రీకాంత్ చేతుల్లో వాలిపోయింది. హృదయానికి అంటుకుపోయింది. అతని గుండె స్పందన తన గుండెకు చేరుకుంది. కళ్ళు మూసుకుంది. రమ్యా అంటూ తలను అదుముకున్నాడు — తల వాలిపోయింది.

"రమ్యా" అన్న కేక హృదయాంతరాలనుండి వెలువడింది. అతని కేక విని చుట్టుప్రక్కల వాళ్ళంతా చేరారు.

అందులో ఒకతను ముందుకు వచ్చి, రమ్యను చూసి "అలా చూస్తారేం ! స్పృహ తప్పినట్లుంది — ఆసుపత్రికి తీసుకుపొండి..." అని సలహా ఇచ్చాడు. మరొకతను సహాయానికి వచ్చాడు. రమ్యను మరొకరు ముట్టుకోవడం ఇష్టం లేనట్లు — శ్రీకాంత్ అవలీలగా రమ్యను చేతులమీదకు ఎత్తుకున్నాడు — ఆ తేలికకు అంత దుఃఖంలోను విస్తుపోయాడు. పరుగెత్తుకుపోతున్న అతన్ని జనం విస్తుపోయి చూశారు.

(ఇంకా వుంది)

నా పెళ్ళినాటికి రాజకీయాల్లో లేను!
నా కొడుకులనయినా నాకిష్టమయిన దుస్తుల్లో పెళ్ళికొడుకు-
-గా చూడాలని... హి..హి..



మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది-చార్మినార్!




విశ్రాంతి పొందండి! సాటిలేనిది చార్మినార్!!

చట్టబద్ధమైన హెచ్చరిక: సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం

STATUTORY WARNING: CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

**1 రూపాయికి 10***

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASV5-237-254 TEL

Main Dealer : **M/s. Kokkonda Kistaiah & Sons,** BHONGIR-508116




# తనదాకావస్తే...?

—మసద్దంశెట్టి

భీమరాజు ఒడ్డూ, పొడుగులో పేరుకు తగ్గట్టుగానే వుంటాడు. అతని తెలివి తేటల ప్రసక్తి యెలావున్నా, కాకా పట్టడంలో అఖండ ప్రజ్ఞావంతుడు. పైకి పోవాలంటే, 'కాకా' ఖచ్చితంగా వుండాలనే సిద్ధాంతాన్ని జీర్ణించుకున్న వాళ్ళలో అతనొకడు. ఆ సిద్ధాంత పరంగా, పై అధికారుల ప్రాపకంతో మెట్లెక్కేసి, అనతికాలంలోనే మేనేజరు పదవిని చేపట్టేశాడు. అతని గురించి పూర్తిగా తెలీనివాళ్ళు మాత్రమే, అతని తెలివితేటల్ని, అదృష్టాన్ని అభినందించారు. తెలిసినవాళ్ళు నవ్వుకున్నారు.

అయితే, కల్లోకూడా వూహించని అటువంటి అదృష్టం వరించేసరికి, భీమరాజు మనస్తత్వంలో హఠాత్పరిణామం వచ్చేసింది. తన పదవికి, తన అంతస్తుకి తగిన హుందాతనాన్ని మెంటెయిన్ చెయ్యాలన్న అభిప్రాయం అతనిలో అహాన్ని రేకెత్తించింది. దాంతో అతని ప్రవర్తనలోనూ, మాటల్లోనూ గంభీరత చోటు చేసుకుంది. మొన్న మొన్నటి వరకూ సహోద్యోగులుగా తనతో పన్జేసిన వాళ్ళతో సహా అందర్నీ అలుసుగా చూడ్డం, అవకాశం చిక్కితే, వెనకాముందూ చూడకుండా వార్ని అవమానించడం అతనికి దినచర్య అయ్యింది. దాంతో ఆఫీసు సిబ్బందిలో సంచలనం కలిగింది. ఆశ్చర్యంతోపాటు, ఆవేశమూ వచ్చింది. కాని, యేం చెయ్యగలరు? భీమరాజు చేతిలో అధికారమనే ఆయుధం తళతళ మెరుస్తూ కనిపిస్తోంది మరి!

* * *

అవకాశం కోసం ఎదురు చూస్తోన్న ఆఫీసు సిబ్బందిని, ఆ రోజు జరిగిన ఓ సంఘటన మరింత వుద్రిక్తపర్చింది.

టైపిస్టు నారాయణరావుకి అర్జంటుగా సెలవు కావల్సివచ్చి దరఖాస్తు పెట్టుకున్నాడు. అయితే, ఆ సెలవుని భీమరాజు మంజూరు చెయ్యలేదు. సెలవు పెట్టిన వెంటనే వజావుగా సెంక్షను చేసేస్తే, తన డిగ్నిటీ మాటేవిటి?...అన్నదే అతని అంతరంగంలో మెదిలిన ఆలోచన.

"నమస్కారం సార్ ..." స్వయంగా మేనేజరు గదిలోకి వెళ్ళిన నారాయణరావు గొంతది.

"నమస్కారం..." హుందాగా అన్నాడు, భీమరాజు.

"నా సెలవు రిగ్రెట్ చేశారట ?... నాకు చాలా అవసరంగా సెలవు కావాలి సార్!" అన్నాడు నారాయణరావు.

భీమరాజు అదోలా నారాయణరావుకేసి చూశాడు. నారాయణరావు అడిగిన తీరులో చెప్పుకోదగ్గ ప్రాధేయతగాని, నమ్రతగాని, కనిపించలేదతని అధికార దృక్కులకు. అందుకని, అతని మొహం కాస్తంత జేవురించింది కూడాను.

"ఔను. రిగ్రెట్ చేశాను. యూ కెన్ గో నౌ..." గంభీరంగా అన్నాడు భీమరాజు.

"అర్జంటుగా నేను వెళ్ళాలి సార్..."

"ఓ వారం రోజులు పోయాక ఆలోచిస్తాను..."

నారాయణరావులో సహనం లోపించింది. "నాకు అవసరమొచ్చినపుడు సెలవివ్వకపోతే, యింక ఆ సెలవు ప్రయోజనం యేముందండీ?" ఘాటుగానే అడిగాడు.

భీమరాజు డిగ్నిటీకి అదోఘాతంలా తగిలింది. మొహం చీదరించుకున్నాడు.

"నీతో వాదించుక్కూచోడానికి నాకు సమయం లేదు. వెళ్ళి నీ పని చూసుకో!" విసుగ్గా అన్నాడు.

"అలా అంటే యెలా? నా అవసరాన్ని..." అని యింకేదో నారాయణరావు చెప్పబోతూ వుంటే, భీమరాజు సహించలేకపోయాడు. తన అంతస్తు, ఆధిక్యత, గుర్తొచ్చాయతనికి. జిడ్డులా నారాయణరావు వదలకపోవడం, అతనికి వుక్రోషం తెప్పించింది. "గెటవుట్... ఐ. సే..." గొంతు చించుకొని అన్నాడు భీమరాజు.

నారాయణరావు నిర్ఘాంతపోయాడు. భీమరాజు యెంత ఆఫీసరు హోదాలో వున్నా, అంత మాటంటాడా? అతనికి కంటెనిండా కోపం వచ్చింది. వుక్రోషంతో వొళ్ళు కంపించింది. అయితే, తన వునికిని గుర్తించుకుని, సంభాళించుకున్నాడు. అవమానభారంతో విసురుగా బైటికొచ్చాడు.

నారాయణరావు తనకి జరిగిన అవమానాన్ని

తోటి వుద్యోగులతో చెప్పుకుని యెంతో బాధ పడ్డాడు. భీమరాజు ప్రవర్తనని అప్పటికే అసహ్యించుకుంటున్న వాళ్ళంతా, నారాయణ రావు పట్ల అతని అసభ్య ప్రవర్తనని నిరసించారు. మూకుమ్మడిగా అతని ముందుకు వెళ్ళాలనుకున్నారు... అతన్ని అవమానించాలనుకున్నారు. అయితే, భీమరాజు అభిమానులు, అనుయాయులు కొందరు మెల్లగా ఆ సీనునుంచి తప్పించుకుపోవడంతో, మెజారిటీ లేకపోయింది. ఆ పరిస్థితుల్లో భీమరాజుని ముఖాముఖీ యెదిరించే పౌరుష, ధైర్యం యెవరికీ లేకపోయాయి. అవకాశం రాకుండాపోతుందా అని, యెదురుచూడసాగారు.

* * *

పై సంఘటన జరిగిన మూడో రోజే మేనేజింగ్ డైరెక్టరు రాఘవరావు, ఆఫీసు ఇనస్పెక్షను కోసం వచ్చి, రెస్టు హవుసులో వుంటున్నట్లు ఆఫీసు సిబ్బందికి తెలిసింది. భీమరాజు అనుయాయులు తప్పించి మిగిలిన వాళ్ళు అతన్ని కలుసుకున్నారు.

"ఏమిటి ? మీరంతా యిలా వచ్చారేం ?" అడిగాడు రాఘవరావు.

"సార్! మేం బ్రతుకుతెరువు కోసం వుద్యోగాలు చేస్తున్నాంగానీ, అవమానాలు అనుభవించడానికి కాదంటే మీరూహర్షిస్తారు. మేం కూడా గౌరవనీయ కుటుంబాలకు చెందిన వాళ్ళమే. మాకూ ఆత్మాభిమానం వుంది" అంటూ తన గోడు చెప్పుకున్నాడు నారాయణరావు.

మిగిలిన వాళ్ళంతా భీమరాజు పట్ల వెలిబుచ్చిన ఫిర్యాదులు సాంతం విన్నాడు రాఘవరావు. నిప్పులేనిదే పొగరాదనుకున్నాడు.

"మీరు చెప్పిందంతా నేను అర్థం చేసుకున్నాను. మీలో రేగిన యీ ఆలజడికి, మీరు అనుభవిస్తున్న మనోవ్యధకు, నా సానుభూతి. మున్ముందు భీమరాజు అలా ప్రవర్తించకుండా మందలిస్తాను. మీరు వెళ్ళండిక..." వాళ్ళకి నచ్చచెప్పాడు రాఘవరావు.

నారాయణరావుతోపాటు, అందరూ ఆ సమాధానానికి తృప్తిగా నిట్టూర్చారు.

"థాంక్స్ సార్ ! మీ మంచితనాన్ని మేం సదా గుర్తుంచుకుంటాం. వస్తాం సార్..." అన్నాడు మరో వ్యక్తి.

అంతా వుత్సాహంతో తిరుగు ముఖం పట్టారు. అందరికంటె యినుమడించిన తృప్తితో కదిలాడు నారాయణరావు.

* * *

మర్నాడు ఆఫీసు ఇన్స్పెక్షను జరుగుతోంది.

భీమరాజు ఛాంబరులో అతని రివాల్వింగ్ చెయిర్‌లో కూచుని, ఫైల్సు తిరగేస్తున్నాడు రాఘవరావు. భీమరాజు అతని ప్రక్కనే నుంచుని, పుట్టిపడే వినయ విధేయతలతో, కేసులు గురించి చెప్తున్నాడు. ఓ కేసు చదువుతూ, హఠాత్తుగా ఆగిపోయాడు రాఘవరావు.

"ఇదేమిటి ? ఈ కేసు డీల్ చెయ్యడంలో యింత జాప్యం యెందుకు జరిగింది మిస్టర్ భీమరాజు ? దీనివల్ల కంపెనీకి యెంతనష్టం వాటిల్లిందో, కంపెనీ ఇమేజ్ యెలా దెబ్బ తిన్నదో, ఆలోచించారా?" కోపంగా భీమరాజుకేసి చూస్తూ, అన్నాడు రాఘవరావు.

భీమరాజుకి ముచ్చెమటలు పోశాయి. తాను యే కేసు గురించి భయపడుతున్నాడో, దాని పైనే రాఘవరావు దృష్టి పడినందుకు వణికిపోయాడు.

"ఇది సెక్షనులో జరిగిన జాప్యం సార్ ! ఆ గుమాస్తాని, ఆఫీసు సూపరింటెండెంటుని టేకప్ చేస్తాను..." అంటూ తప్పించుకో జూశాడు.

"మిస్టర్ భీమరాజు! కేవలం గుమాస్తాల పైనే బాధ్యతంతా రుద్దాలనుకుంటే మరింక మేనేజరు పోస్టు అవసరం లేదనుకుంటాను. మీరేం చేస్తున్నట్టు ? యూ ఆర్ సోల్లీ రెస్పాన్సిబుల్. మీ సంజాయిషీ సబ్మిట్ చెయ్యండి..." కోపంగానే అన్నాడు రాఘవరావు.

భీమరాజు నీరైపోయాడు. రాఘవరావు యింత కోపిష్టని అతనికెప్పుడూ తెలీదు. అయినా తననే సంజాయిషీ యిమ్మంటే, తన క్రింద పనిచేసే స్టాఫ్ తనని యింకేం గౌరవిస్తారు ?...అన్న బాధ అతణ్ణి పట్టుకు పీడించింది.

"అదికాదుసార్...అనవసరంగా మీరు..." అని యింకేదో చెప్పబోయాడు భీమరాజు.

"మిస్టర్ భీమరాజు! మరేం సాకులు చెప్పవద్దు..." గంభీరంగా అన్నాడు రాఘవరావు.

భీమరాజు సహనాన్ని కోల్పోయాడు. తానూ ఒక అంతస్తులో వున్నవాడే అయినా, తనని యిలా అవమానించడమా ?

"నేను చెప్పేది వినండి సార్..." అసహనంతో యేదో చెప్పబోయాడు భీమరాజు.

భీమరాజు మాటల్లోని అసహనం, ఓ విధంగా యెదిరింపులానే తోచింది రాఘవరావుకి. ఆఫీసు సిబ్బంది ఫిర్యాదు ఆ క్షణంలో అతని చెవుల్లో గింగురుపెట్టింది.

---

మదరాసు సిటిజన్స్ కమిటీ (రిజిష్టర్డ్) వారు జూలై 18, 19 తేదీలలో తమ సంస్థ మొట్టమొదటివార్షికోత్సవాన్ని మద్రాసులో వైభవంగా జరుపుకున్నారు. స్వామి శంకరదాస్ ఆడిటోరియంలో జరిగిన ఈ ఉత్సవాల మొదటి రోజున కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేస్తున్న ఆంధ్రాబ్యాంకు డెప్యూటీ జనరల్ మానేజరు శ్రీ శంకరన్, రెండవరోజు ప్రారంభోత్సవం చేస్తున్న ఇన్కమ్‌టాక్స్ అప్పిలేట్ ట్రిబ్యునల్ ఉపాధ్యక్షుడు శ్రీ సిహెచ్. జి. కృష్ణమూర్తి, డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, డా. ఎం. ఎల్. వసంతకుమారి గార్లను చిత్రంలో చూడవచ్చును.



## తనదాకా వస్తే...?

"నో ఆర్గ్యుమెంట్... డోంట్ ట్రై టు డిఫెండ్ యువర్ సెల్ఫ్..." కాస్త గట్టిగానే అరిచాడు రాఘవరావు.

ఆ కేకలు విని అప్పుడే ఆఫీసు స్టాఫ్ కొందరు ద్వారం దగ్గరికి వచ్చినట్టు పసిగట్టిన భీమరాజుకి, గుండె ఆగినంత పనయ్యింది. తన అంతస్తుకి విలువేముందింక ? ఎంత మేనేజింగ్ డైరెక్టరయితే మాత్రం, తనని యిలా అవమానించడమా ?... ?

"సార్! మీరు నాకేం శిక్ష విధించినా భరించేవాణ్ణి. కాని, యిలా నన్నవమానించడం సబబుగా లేదు. నాకూ ఆత్మాభిమానం వుంది. వ్యక్తిత్వం వుంది." బాధగా అన్నాడు.

రాఘవరావు భీమరాజుకేసి సూటిగా చూశాడు. "మీ విషయంలో నేనిలా అవమానించడం సబబుగా లేదంటున్నారు. మీకు ఆత్మాభిమానం, వ్యక్తిత్వం వున్నాయంటున్నారు. మరి, మీ ఆఫీసులో పనిచేసే వాళ్ళకేనా ఆత్మాభిమానం, వ్యక్తిత్వం లేనిది ? వాళ్ళని మీరు అవమానించినప్పుడు, అది సబబుగా లేదన్న విషయం గుర్తుండదా ? ఆత్మపరిశీలన అప్పుడు లేకపోయిందా ?" అంటూ చిన్న చిరునవ్వు పెదాలపై చిందించాడు రాఘవరావు.

భీమరాజుకి విషయం యేమిటో యిప్పుడర్థమయ్యింది. రాఘవరావుగారి ఆవేశానికి, అసంతృప్తికి వెనుక గల కారణం యేమిటో తెలుసుకోగలిగాడు. అతని కళ్ళను కప్పిన నీలితెర తొలిగిపోయింది. నారాయణరావుపట్ల తన ప్రవర్తనకి సిగ్గుపడ్డాడు. "ఇప్పుడంతా నాకు అర్థమయ్యింది సార్! నిజంగా తప్పు నదే! ఆ క్షణంలో ఆ వుద్రేకానికి పశ్చాత్తాపపడుతున్నాను. అటువంటి పొరపాటు మరెప్పుడూ జరక్కుండా చూస్తాను. నా తప్పును గుర్తుచేసి, నాకెంతో మేలు చేశారు..." క్షమాపణ చెప్పుకున్నాడు భీమరాజు.

రాఘవరావు తృప్తిగా నవ్వుకున్నాడు. "మిష్టర్ భీమరాజూ! మీ తప్పును మీరు తెలుసుకున్నారు... అది, ఆరోగ్యకరమైన పరిణామం. అధికారం మన చేతిలో వుందని, హద్దులు మీరకూడదండీ! అధికారంతో గౌరవాన్ని సంపాదించలేం... కేవలం అభిమానంతోనే సంపాదించగలం." అన్నాడు సలహా యిస్తున్నట్టుగా.

"ఔను సార్! మీరు చెప్పింది నిజం..." అంటూ భీమరాజు కాలింగ్ బెల్ నొక్కాడు. ప్యూన్ హాజరయ్యాడు.

"టైపిస్టు నారాయణరావుని యిలా రమ్మను..." అన్నాడు.

రెండు నిమిషాల్లో నారాయణరావు లోపలికొచ్చాడు. ఇద్దరికీ సవినయంగా నమస్కరించాడు.

"నారాయణరావ్, నీపట్ల నేను ప్రవర్తించిన తీరుకి సిగ్గుపడుతున్నాను... క్షమించు. రేపట్నుంచి సెలవులో వెళ్ళు..." అన్నాడు భీమరాజు.

నారాయణరావు మురిసిపోయాడు. "థాంక్యూ సార్... థాంక్యూ సార్..." అని యిరువురికీ అభివందనలు చెప్తూ వుత్సాహంగా బైటికి నడిచాడు.

రాఘవరావు ముసిముసిగా నవ్వుతూ, భీమరాజు వీపుమీద తట్టాడు.

ఆ రోజునించి భీమరాజు మారిన మనిషి!! ●

## చిత్తుకాగితాల నుండి ఇథనాల్

పశ్చిమ జర్మనీలోని డోర్నియర్ ప్రయోగశాలవారు చిత్తుకాగితాలవలన మరో వుపయోగం వుందని కనుగొన్నారు. ఒక కిలోగ్రాము చిత్తుకాగితాల నుండి ¼ లీటరు ఇథనాల్‌ను తయారు చేయవచ్చునని నిరూపించారు. ఇథనాల్‌ను పెట్రోలుతో కలిపి కార్లలో వుపయోగిస్తున్నారు. బ్రెజిల్ వంటి దేశాలలో ఇథనాల్‌ను చెరుకు నుండి తయారుచేసి పెట్రోలుపై ఆధారపడటాన్ని తగ్గిస్తున్నారు. అయితే కాగితం నుండి తయారుచేసే ఇథనాల్ మరింత శక్తివంతమైనది. పైగ యిది చాలా చౌకపద్ధతికూడా. పశ్చిమ జర్మనీలో లభించే చిత్తుకాగితాలను పూర్తిగా ఇథనాల్‌గా మారిస్తే, దేశంలో పెట్రోలు వాడకం పది శాతం తగ్గగలదని భావిస్తున్నారు.

(గత సంచిక తరువాయి)

























[ఇంకా ఉంది]

ధర్మపథం **సీతాదేవి యుక్తి** — బులుసు వేంకటరమణయ్య

రాముడు తన వనవాస వృత్తాంతాన్ని తెలిపి, తల్లి అనుమతిని పొందుటకు కౌసల్య నివసిస్తూ ఉన్న భవనానికి వెళ్ళి, ఆమెకు విషయమంతా చెప్పి, ఎలాగో నచ్చ జెప్పి, ఆమె అనుమతిని తీసుకున్న పిదప సీతాదేవి ఉంటున్న మందిరానికి వెళ్ళాడు. రాముణ్ణి తీసుకురమ్మని దశరథుడు సుమంతునితో చెప్పినపుడు, రాముడు సీతవద్దనే ఉన్నాడు. అప్పుడు సంతోషంగా ఉండిన భర్త ముఖం ఇప్పుడు వెల వెల పోయి ఉండడం చూచి ఆమె చాలా భయ పడింది.

రాముడు తన వనవాస వృత్తాంతాన్ని సీతకు తెలిపి, ఆమెను విడిచి ఉండడం విచార కారణమని తెలియ జేశాడు. ఆ వృత్తాంతం విని సీత ఎంతో ఆశ్చర్య పడింది రాముడు వనవాసానికి పోవడానికి ఎంతో దుఃఖించింది. ''నేను పధ్నాలుగేళ్ళు వనవాసం చేసి, తిరిగి వస్తాను. అంత వరకూ నీవు ఇక్కడనే వుండు'' అని రాముడన్నాడు. సీత, తాను కూడా అడవికి వస్తానని చెప్పింది. ''అడవిలో సింహాలు, పెద్దపులులు, ఏనుగులు, సివంగులు, విష సర్పాలు ఉంటాయి. నీ వంటి వారు ఉండలేరు'' అన్నాడు రాముడు. ''ముల్లోకాలనూ జయింపగల మహా వీరులు మీరు! మీ ప్రక్కనుంటే నాకు ఎటువంటి భయమూ లే''దని సీత అన్నది. రాముడు మళ్ళీ అరణ్యంలోని కష్టాల నన్నింటినీ వివరించాడు. అప్పుడు సీత చెప్పిన సమాధానం యిది—

''భార్యాభర్తలు ఒకటే శరీరం. సగం శరీరం భర్త, సగం శరీరం భార్య. కష్టసుఖాలు శరీరం అంతటికీ కలుగుతాయి, కాని కొంత భాగానికి కలిగి, కొంత భాగానికి కలగ కుండా ఉండవు. మీరు కష్టాలనుభవిస్తే నేనూ అనుభవించాలి; సుఖాలనుభవిస్తే వాటిని నేను అనుభవించాలి. సగం శరీరాన్ని ఇక్కడ విడిచి పెట్టి సగం శరీరం అడవికి పోవటం ఎంత మాత్రం తగదు దయయుంచి నన్ను కూడా మీతో తీసుకుపొండి'' అని.

ఈ మాటలకు రాముడు సమాధానం చెప్పలేక పోయాడు పురుషునికి భార్య, తన శరీరంలోని సగభాగమని ఆయన గ్రహించాడు. అందువల్ల తనతో కూడా ఆమెను అడవికి తీసుకొని పోవడానికి సమ్మతించాడు.

రాముని అంగీకారానికి సీతాదేవి పరమానందభరితురాలయింది. పై విషయం శ్రీహరిచరితంలో ఇలా ఉన్నది—

''తస్మా దర్ధ శరీరం
కస్మా న్నయసేన పావనం హి వనమ్,
శ్రుతి రాహ న కిం జాయా
మేవం రూపాం కృపానిధే! నయమామ్''

సీత రామునితో అన్న మాటలు పై శ్లోకంలో ఉన్నవి.

# మార్కుల కార్ఖానాలు



— పిప్పళ్ళ సూర్యప్రకాశరావు

"మన కులంవాళ్ళను కుళ్ళబొడవాలని చూస్తున్నాడా ప్రొఫెసరు. మీరేమో ఆయన కులం వాళ్ళని కడుకుపోట్లు పొడుస్తున్నాను కదా అంటే విలాగూ? పోని కులం కల్పిందని తెల్సినప్పట్నుంచీ మన కులం కుర్రాళ్ళకు యేమైనా మీరు సాయం చేస్తున్నారా అంటే అదీలేదు.

కులాలవారీగా యీ రోజుల్లో కాలేజీలు పెట్టుకుంటుంటే, యూనివర్సిటీలో మీరు మడికట్టుకు కూర్చుంటే విలా?

మీరు మాకు గురువులే కాదు 'కుల గురువులు' కూడా! ప్రెసిడెంట్ గారే యిలావుంటే రేపొద్దున్న మన మెంబరెవడూ మరో మెంబరుకి సాయం చేయడు కూడా! ఇలా అయితే మన కులం యేమిగావు?

మీరు కులంసంగతేమీ పట్టించుకోకుండా కూర్చుంటే మన కులం సంఘంలోంచి మిమ్మల్ని వెలివేయాల్సి వుంటుందేమోనని హాస్టల్స్‌లో మన కులం కుర్రాళ్ళు అనుకుంటుంటే నేను విని మీ దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చాను" అని రొప్పుతూ చెప్పాడు కాకారావు.

తుళ్ళిపడ్డాడు కాకారావుగారి రీడరు — కాకారీడరు.

కాస్త తేరుకుని—

"ఇంతకీ అసలు సంగతేమిటో చెప్పు" అన్నారాయన.

"ఏముందండి. బాకారావుగాడికి రెండు ప్రశ్నలు తెల్సాయండీ. వాడు అవి రెండూ బట్టీబట్టి ఓ బీరుబుడ్డి కొట్టేసి నిద్ర పోయేడండి రాత్రి."

ఓస్ యింతేనా అన్నట్టు తేలిగ్గా నవ్వేశారాయన.

"వాడికి బోడి రెండు ప్రశ్నలె తెల్సాయా అంతేనా. రెండో పేపరు నేనేగా యిచ్చేది. బెంగెట్టుకోకు. పేపరు పట్టుకెళ్ళు. నే కాదన్నానా?" అని రెండో పేపరిచ్చి, అందులో వున్న ప్రశ్నలు రాసుకొమ్మని, కాగితం కలం కూడా ఆయనే యిచ్చారు!

మర్నాడు బాకారావు ఒగురుస్తూ వచ్చాడు వాళ్ల కులం ప్రొఫెసరు దగ్గరికి

"సార్!

కాకారావుగాడు యూనివర్సిటీ లైబ్రరీ అంతా దున్నేస్తున్నాడు. రిఫరెన్స్ సెక్షన్‌లో నిన్నస్తమానం చదివి చదివి ఓ క్వార్టర్ బాటిల్ లాగించి నిద్రపోయాడు రూంలో" అన్నాడు.

ఫక్కున నవ్వాడా బాకారావుగారి ప్రొఫెసరు — బాకా ప్రొఫెసరు!

"పిచ్చివాడా!

ఈ రోజుల్లో దున్నేవాడి వోట్లో మన్నేనోయ్. అది భూమేకాదు. లైబ్రరీ అయినా అంతే!

నేనిచ్చేప్రశ్నలకు సమాధానాలు లైబ్రరీలో దొరకవు. ఇక రిఫరెన్స్ జర్నల్స్ అంటావా, వాటిని చదివే ఓపిక నాకెలాగూ లేదు కాబట్టి అందులో ఆన్సర్లు వుంటాయనుకోవడం మీ భ్రమ.

చూడు యీ నోట్సులోనే అన్ని సమాధానాలు వున్నాయి. ఈ నోట్స్ పాతికేళ్ళ క్రితం మా ప్రొఫెసరు నాకిచ్చి చచ్చిపోయాడు. ఆయనకు ఆయన ప్రొఫెసరు గారిచ్చారట. ఇది జాగ్రత్తగా పట్టుకెళ్ళు. దార్లో 'నేషనల్ ఆర్కివ్స్'వారు చూస్తే వెంటపడగలరు" అని దుమ్ము దులిపి ఓ నోట్స్‌బుక్ యిచ్చారా సైన్సు ప్రొఫెసరుగారు బాకారావుకి.

ప్రిపరేషన్ శెలవుల్లో బాకారావు, ప్రొఫెసరుగార్ని బంధుమిత్ర సపరివారముగా టాక్సీలో సింహాచలం తీసుకెళుతూ—

"సార్!

మీరు 'గాడు – గాడు' అని పిలిచే లెక్చరర్ మూర్తిగార్ని కాకారావుగాడు 'గారూ–గారూ' అని కాకాపడుతున్నాడు." గురువుగార్ని కాకారావుమీద వుసిగొలిపాడు బాకారావు.

ఈ యూనివర్సిటీ కుర్రాడెవడోగాని మా కడుపులు తెగ కొడుతున్నాడని రైల్వే కూలీలు ఎంత మొత్తుకుంటున్నా వినిపించుకోకుండా సామాన్లు మోస్తూ కాకారావు తన రీడర్ని సతీసమేతంగా తిరుపతి తీసుకెళుతూ—

"సార్ !

మొన్న యూనివర్సిటీ ఎలక్షన్‌లో మన కులం వోటని కలుపుకోవడానికి మీ ఎలక్షన్ ఏజంటుగా వున్నానని బాకా ప్రొఫెసర్‌కి నేనంటే కోపం సార్. నా మార్కులు కోసేస్తాడని భయంగా వుంది. అయినా అంతా ఏడుకొండలవాడి దయ" అని నాలిక్కరుచుకుని "అంతా మీ దయే" అన్నాడు కాకారావు.

"ముందు నాకు మొక్కులు చెల్లించు భయపడొద్దు" అని వెంకటేశ్వరుడిలా అభయమిచ్చారు కాకారీడరు తిరుపతిలో తన శిష్యుడికి.

* * *

అడ్వాన్స్‌గా కట్నాలు తీసుకున్న వాళ్ళ బాబులకు యిబ్బందికల్గించకూడదనోమరెందు చేతనో విశ్వవిద్యాలయంలోని కులాల సంఘాల కు రోళ్ళు కొట్టుకోలేదు ఆ నెలలో. అందుకే అనుకోని విధంగా, అనుకున్న ప్రకారం ఎం. ఎస్. సి పరీక్షలయ్యాయి! ఓ రోజున ఆవకాయ జాడీలతో హడావుడిగా వూడిపడ్డాడు రిక్షాలో కాకారావు. పేపర్లు దిద్దుతున్న రీడర్‌గారు 'రావోయ్ సమయానికొచ్చావ్ రారా' అని శిష్యుణ్ణి ఆహ్వానించారు.

"అసలు నీవు ఏమి రాసావో నాకేమీ తెలియడంలేదు. నీ పేపరు నువ్వే మరోసారి చూస్కో" అని కాకారావు పేపరు కాకారావుకే యిచ్చారు కాకారీడర్ గారు.

'సార్ !

మీకు తెల్సో తెలియదో నా పేపర్లు కూడా మా నాన్నే యింతవరకూ పరుగెట్టి పాస్ చేయించాడండి. నేను యూనివర్శిటీలో చేరిన తర్వాత ఓ రోజు పిల్చి, "ఒరేయ్ అబ్బాయ్ నాకు శక్తి సన్నగిల్లిపోయింది. నీ పేపర్లకూడా మవ్వు పరుగెత్తే పెద్దోడి వయ్యేవ్. నా బాధ్యత నీకుఅప్పగిస్తున్నా(నా" అని కళ్ళు మూశాడండి." అని కాకారావు కళ్ళనీళ్ళు పెట్టుకుని గురువుగారి గుండెను కరిగించేసాడు. మధ్య మధ్యలో తన పేపర్లోని తప్పుల్ని ఒప్పులుగా మార్చాడు. కుర్రాడు తన పేపరు తనే ముందుగా ఓసారి దిద్దుకున్న తర్వాత ఆ పైన మాష్టారు అతగాడి పేపరు దిద్దుతున్నారు. కాని మాష్టారు వేస్తున్న మార్కులు చూపి కాకారావు–

"అదేంటి మాష్టారూ! అవతల బాకారావుగాడు మొదటి పేపర్లో ఎనభై మార్కులు తెచ్చుకున్నాడు. మరి మీరేమో..." అని బేరమాడబోయాడు. కాకారీడరికి కోపమొచ్చింది శిష్యుడి అజ్ఞానానికి.

"అసలు నీకు బుద్ధుందా ? ఇంటర్నల్ ఎసెస్‌మెంట్... ఓహో నీవు తెలుగు మీడియంలో కాలేజీ వెలగబెట్టావు కదూ. ఇంటర్నల్ ఎసెస్‌మెంట్ అంటే 'అంతరివ్ మదింపు' పద్ధతివున్న ఏ యూనివర్సిటీలోనూ కుర్రాళ్ళు మార్కులు తెచ్చుకోరు. మాష్టర్లే యిస్తారు. బాకారావుకి ఎనభై మార్కులు వచ్చాయంటే బాకా ప్రొఫెసరు ఆ పేపర్లో ఎనభై యిచ్చాడంటావ్. నేను నీకు ఎనభై అయిదు వేస్తాను సరేనా ?" అన్నారు రీడరుగారు.







# మార్కుల కార్ఖానాలో

ఎండలు మండిపోతున్న ఓ శుభ ముహూర్తాన మామిడి పళ్ళ బుట్టలు మోయించుకొచ్చి ప్రొఫెసర్‌గారికి సాష్టాంగ పడ్డాడు బాకారావు.

"మీరేమో చెంచాలతో కొలిచివేస్తూ వుండండి. అవతలాయన కుంచాలతో కొలవకుండానే పోస్తున్నాడు మార్కులు" అని మొర పెట్టుకున్నాడు.

"నాకు తెల్సు. ఆ రీడర్‌గాడు వట్టి మట్టిబుర్ర వెధవ వాడు రీడరైనా కుంచాలు ఎపుడో ఎత్తేసారన్న సంగతికూడా తెలియదు. ఇపుడంతా మెట్రిక్ సిస్టమ్. నీవు బెంగెట్టుకోకు. నీకు కేజీలతో పోస్తానుగా మార్కులు" అని అంతకుముందు ఆయన వేసిన ఎనభైని తొంబయి చేశారు.

ప్రాక్టికల్ పరీక్షలు కూడా అయినతర్వాత కాకారావు రీడరుగారితో —

"సార్! కులం కలిస్తే మార్కులు అందరూ వేస్తున్నారు. మన కులంలో పుట్టింది మీరూ నేనే కాదు. కులాల సంఘాలతో విలసిల్లుతూంది మన విశ్వవిద్యాలయ మొక్కటే కాదు. మీకు నేను చేసిన వెట్టి చాకిరీకి బహుమతి కానివ్వండి, లేదా 'కులం కుర్రోడి'పట్ల 'కులం రీడరు' కనీసపు బాధ్యతగానివ్వండి గోల్డ్ మెడల్ యివ్వండ"ని మెడలు వంచి మోకరిల్లాడు కాకారావు.

బాకారావేమీ తక్కువ తిన్లేదు.

"ప్రొఫెసర్‌గారూ!

'మాచిరాత పరీక్షా పద్ధతి' ఎలాగూ వస్తోంది కాబట్టి లెక్చరర్లకు రాయడం, చదవడం వస్తే సరిపోతుందని నాకూ తెల్సు సార్.

ఏంతయినా బంగారు పతకం అవతల కులం వాడికి వెళుతుంటే మీకు ఎలా అనిపిస్తుందో నాకు తెలియదుకాని నాకుమాత్రం రక్తం వుడికిపోతోంది సార్!" అని ఆవేశంతో ఊగిపోయాడు.

గురువుగారికి చావుకు పెడితే శిష్యుడు లంఖణాలకొస్తాడని కాకారీడరు బాకారావుకి ప్రాక్టికల్స్‌లో అత్తెసరు మార్కులు వేశారు. బాకా ప్రొఫెసరు కాకారావుకి తన ప్రాక్టికల్స్‌లోనూ అదేపని చేసి రిజిష్ట్రార్ ఆఫీసుకి మార్కులు పంపించేసారు. కాకారీడరు రిజిష్ట్రార్ ఆఫీసులో తన 'కులం క్లర్కు'ని కల్సుకుని, బాకారావుకి ఎన్ని మార్కులు వచ్చాయో తెల్సుకుని, కాకారావుకి మరో మార్కు ఎక్కువేసి తన శిష్యుడికి— సారీ— తన 'కులానికి' బంగారు పతక మిచ్చుకున్నారు!

ఫలితాలు తెల్సిన మర్నాడు ఆ విశ్వవిద్యాలయంలో ఓ సంతాప సభ జరిగింది.

ఆ సంతాప సభకు విశ్వవిద్యాలయంలోని విద్యార్థులూ, వుపాధ్యాయులందరూ హాజరు కాలేదు. వున్న కులాలు చాలదన్నట్టు ఆ విశ్వవిద్యాలయంలో ఆర్ట్సు, సైన్సు, ఇంజనీరింగ్ అనే "మూడు కొత్త కులాలు" వెలిసి ఆ ఐలయాన్ని మరో మూడు ముక్కలుచేసాయి. అందువలన ఏ సభకయినా అసలు కులాలతో పాటు యీ "చిరుకులం" కూడా కలిస్తేగాని అందరూ కలుసుకోరు.

తప్పదన్నట్టు యింతకీ సంతాప సభ ఏందుకు జరిగిందయ్యా అంటే—

మొట్టమొదటి నుంచీ "మొట్టమొదటి" కుర్రాడు ఎం. ఏస్. సి ఆఖరి సెమిష్టర్ "మూడోవాడు"గా వచ్చి గోల్డ్ మెడల్ కాదు కదా కనీసం రీసెర్చి ఫెలోషిప్పు కూడా రాదని—

అప్పైనంతా అమ్మి చదువు చెప్పించిన అమ్మకు మొహం చూపించలేక—

కాకా పట్టక
బాకా వూదలేక
ఓ అమాయక విద్యార్థి
"ఆత్మహత్య" చేసుకున్నాడట!

### కాగితపు పూలు

'కుక్కిన పేను లాంటి జనం
మొక్కిన వరమివ్వని ప్రభుత్వం,
అక్కరకు రాని చట్టం'
అంటే నాకు అసహ్యం!

— ఎస్. సంజీవ్

# ఫాలాక్షుని డైరీ

## వంటిమీద నగలుంటే ...!

తమిళనాడు కొమారపాళయానికి చెందిన పెరుకొట్టు గ్రామంలో 32ఏళ్ల ధనలక్ష్మి అనే ఆమె 22వ తేదీ స్కూలుకు వెళ్లి తిరిగి రావేలేదట. ఈమె ఆ స్కూలులో టీచరట. ఆమె వంటిమీద తొమ్మిదివేల విలువచేసే బంగారు నగలున్నాయట. 22వ తేదీ ఉదయం తన 8ఏళ్ల కొడుకు సోమసుందరంతో స్కూలుకని బయలుదేరిందామె. అటు స్కూల్లోనూ లేదట, ఇటు ఇంటికి రాలేదట, ఆ పల్లెలోనూ లేదట. ఆమె భర్త పోలీసులవద్ద భోరుమన్నాడట— అనడావురి!

### అభయం అంటే ...!

ఒరిస్సా రాష్ట్రానికి చెందిన "సువట" అనే గ్రామంలో ఓ 18ఏళ్ల హరిజన పిల్ల మెట్రిక్కు పరీక్ష ప్యాసయికూడా ఏ ఉద్యోగమూ దొరకనందువల్ల కవున్‌రియాముజుకి అనే ఉపమంత్రిగారి సహాయం కోరిందట. ఆయన అభయమిచ్చి ఆమెను ఉద్యోగమిస్తాను రమ్మని అంగ్రమదా అనేచోటులో ఉన్న ప్రభుత్వ విడిదికి తీసుకువెళ్లి, అక్కడామెను బలాత్కారంగా అనుభవించారట. అనక ఆయన స్నేహితుడు పూర్ణాజనా అనే అతనుకూడా బలాత్కరించాడట. ఆ మంత్రిగారు తన బంగళాకు తీసుకువెళ్లి అక్కడ మళ్లీ అనుభవించి, వదిలేశారట. ఫలితంగా ఆమె గర్భవతియై అది భరించలేక గర్భస్రావం చేయించుకున్నదట. ఆ లక్ష్మిప్రియ [ఆమె పేరు] ఈ విషయమంతా ఇందిరాగాంధికి రాసి, నాకు "న్యాయం కావాలి" అన్నదట.

### అక్రమానికి పరాకాష్ఠ!

హర్యానా జిల్లాకు చెందిన నియోలా గ్రామంలో 27ఏళ్ల హవాసింగ్‌కు, 17ఏళ్ల రాజా బాలకు వివాహమయిందట. అందరిలా కలలుకన్న రాజాబాల కాపురానికి వెళ్లి అక్కడ స్థితిగతులు చూసి కొయ్యబారిందట. ఆమె బావగార్లు లక్ష్మన్‌సింగ్, ప్రేతిసింగ్ ఆమెకేసి పోజులు విసరనారంభించారట. ఈ విషయమామె భర్తతో చెప్తే అవన్నీ చూసీ చూడనట్టు పోవాలని హితవు చెప్పాడట. ఒకనాడతను వూళ్లో లేని సమయంచూసి లక్ష్మన్‌సింగ్ ఆమెను బలాత్కరించి అనుభవించాడట. ఈ విషయం భర్తతో చెప్తే నీదే తప్పని చితకబాదాడట. మరోసారి ప్రేతిసింగ్ ఆమెను బలాత్కరించాడట. అనకివా వారిద్దరూ ఎప్పుడు సమయం దొరికితే అప్పుడామె మీదపడి, తమ కామదాహం తీర్చుకోనారంభించారట. ఈ బాధలు పడలేక ఆమె ఓ రాత్రి పారిపోయి పుట్టింటికివచ్చేసిందట. ఆమె అన్న గోవిందసింగ్ ఆ రాత్రి ఆమెను చెరిచాడట. అక్కడ అక్రమం భరించలేక ఇక్కడకువస్తే, ఇక్కడ సొంత అన్నగారే తనను చెరచేసరికామె మతి తప్పినదానిలా అయిపోయిందట. ఓ రోజు తన భర్త అన్న ప్రేతిసింగ్ వచ్చి తనతో వచ్చేయమనీ, తాను ఆమెను ప్రాణప్రదంగా చూసుకుంటానని ఆమెకు హితవు చెప్పాడట. ఈ విషయంలో ప్రేతిసింగ్‌కు గోవింద్‌సింగ్‌కు పోట్లాట వచ్చిందట. గోవింద్‌సింగ్ తన స్నేహితుని సహాయంతో ఆ ప్రేతిసింగ్‌ను హరియానా విశ్వవిద్యాలయం ప్రాంతంలో చంపేసి, ఓ నూతిలో పారేశాడట. చట్టమిప్పుడాయిద్దర్నీ అరెస్టు చేసిందట.

# ఫాలాక్షుని డైరీ

### బలిగొన్న ప్రేమ!

పచ్చూర్ అనే గ్రామానికి చెందిన మల్లై కుప్పుస్వామి అనే అతనికూతురు 16ఏళ్ల వాసంబాల్ తమ ఇంట్లో పనిచేసే 21ఏళ్ల బాలసుబ్రహ్మణ్యం అనే అతన్ని ప్రేమించి, అతనితో భవాని అనే వూరికి పారిపోయి, ఆవూళ్లో కాపురంపెట్టిందట. ఆమె తండ్రి, అన్నగారు, మేనమామా వచ్చి మీకు వివాహం చేస్తామని చెప్పి వారిద్దర్నీ బయలుదేరదీసి, తమ వూరి పొలిమేరకు వచ్చాక మళ్లీ ఈ వూరు వచ్చావో నిన్ను చంపి,పాతరేస్తామని బాలసుబ్రహ్మణ్యాన్ని బెదిరించి,తమ కూతురుతో వూళ్లోకి వెళ్లిపోయారట. ఇది మొన్న తొమ్మిదోతేదీన జరిగిందట. 18వ తేదీన వాసంబాల్ చనిపోయిందని, 19వ తేదీ తెల్లవారుజామున ఆమె శవాన్ని దహనం చేసేశారట ఆమె తల్లిదండ్రులు. వాసంబాల్ తల్లిదండ్రులే ఆమెను కొట్టి, చంపేసి ఉంటారని బాలసుబ్రహ్మణ్యం పోలీసులకు ఫిర్యాదు చేశాడట.

### అర్ధరాత్రి ఆర్తనాదం!

నార్త్ ఢిల్లీ నరేలా ప్రాంతంలో ఏప్రియల్ 5న తేదీ అర్ధరాత్రి వో ఆర్తనాదం వినబడ్డదట. 45 ఏళ్ల రూప్‌నారాయన్ అనే అతను తప్పతాగి వచ్చి 16ఏళ్ల తన కూతురుమీద విరుచుకు పడ్డాడట. ఈ దారుణం చూసిన అతని భార్య అతన్ని వారించబోయేసరికి కత్తితీసి ఆమెను బెదిరించి, కూతుర్ని బట్టలన్నీ విప్పమని బెదిరించి, కన్న కూతురితో తన కామాన్ని తీర్చుకున్నాడట. ఈ గొడవ వినివచ్చిన అతని కొడుకు 17 ఏళ్ల నరేష్ ఆత్రంలో తండ్రి మీద పడి, అతని చేతిలో కత్తితో అతన్నే పొడిచి చంపేశాడట.

### వింత కేసు!

జర్మనీలో సూసన్ బుకోల్డ్జ్ అనే వో టైపిస్టు తన టేబులు మీద తన ప్రియుని నగ్న ఫోటో పెట్టుకున్నదట. ఆ కంపెనీ యజమాని ఇది తెలిసి ఏవిటీ న్యూసెన్సు, తీసెయ్ ఆ నగ్న ఫోటో అన్నాడట. ఆమె తీయనుపొమ్మన్నదట. దాంతో ఆయనామెను వుద్యోగం నుంచి తీసేశాడట. ఆమె లేబరు కోర్టులో దావా వేసిందట. జర్మను ఇండస్ట్రియల్ కోర్టులో ఈ కేసు కూలంకషంగా విని నగ్న సుందరుల బొమ్మలు బజార్లో విరివిగా దొరుకుతాయి అవి ఆఫీసుల్లో పని చేసే వారు తెచ్చుకుని డ్రాయర్లలో పెట్టుకుని అప్పుడప్పుడు చూసి ఆనందిస్తుంటారు. కొందరివో క్యాలెండర్లు కూడా అలాంటి వున్నాయి. వాటిని అసభ్య చిత్రాలుగా పరిగణించ లేదు. అటువంటప్పుడు ఆమె తనకు నచ్చిన వాని ఫోటో నచ్చిన రీతిలో నచ్చిన చోట పెట్టుకోడం తప్పేమీ కాదు అన్నారట. ఆమెకు మళ్ళీ వుద్యోగం యిప్పించాడట న్యాయమూర్తి. ఫన్నీ!!




ఆఫీసు నుండి వచ్చి ఇంట్లోకి ప్రవేశించ డానికి గేటు తీయబోయిన గుమాస్తా గురుమూర్తి ఒక్క క్షణం ఆశ్చర్యపోయి ఆ తరువాత సందిగ్ధంలో కొట్టుకుపోయాడు. 'ఇది తన ఇల్లేనా' అనే అనుమానం కలిగిం దతనికి. ఒక్క అడుగు వెనక్కి వేసి గేటు ప్రక్కనున్న గోడమీదికి చూశాడు. 'కిష్కింద' సంధ్య వెలుగులో పాలరాతిమీది అక్షరాలు స్పష్టంగా కనిపించాయి.

నిశ్చయంగా తన ఇల్లే, అనుమానంలేదు. కాని మరి ఏమిటీ విపరీత నిశ్శబ్దం. స్కూలు సమయంలో, నిద్రపోయే సమయంలో తప్ప ఆ ఇంట్లో ఎప్పుడూ ఏదో రకంగా పెద్ద అల్లరి అవుతూనే ఉంటుంది. ఒకరి నొకరు కొట్టుకుంటున్న చప్పుడు, తిట్టుకుంటున్న చప్పుడు, వికటాట్టహాసాలు చేస్తున్నచప్పుడు, లేదా పెడబొబ్బల చప్పుడు, సామానులను విరగగొడుతున్న చప్పుడు— ఇలా రకరకాల చప్పుళ్లతో ఆ ఇల్లు ఎప్పుడూ రణగొణ ధ్వనిగా ఉంటుంది. అందుకే "శ్రీరామ నిలయం" అని తండ్రి పెట్టిపోయిన పేరును తీసివేసి దానిస్థానే కిష్కింద అని వ్రాయించాడు గురుమూర్తి. అటువంటి కిష్కింద నేడు రాముడు లేని అయోధ్యలా నిశ్శబ్దంగా ఉండేసరికి ఆ కిష్కింద పాలకుడైన గురుమూర్తి సంశయంలో కొట్టుమిట్టాడి, ఆశ్చర్యపోవడంలో తప్పులేదు.

గేటు తీసుకొని లోపలికి ప్రవేశించాడు. పర్వకాల సాయంత్రాలలో వరండాలోనే క్రికెట్ ప్రాక్టీసు చేసుకుంటూ ఉండే రవి కనిపించ లేదు. వాడేదో సైన్సు రికార్డు వేసుకుంటు న్నాడు. ఎప్పుడూ సవతుల్లా, బద్ధశత్రువుల్లా పోట్లాడుతూ ఉండే అరుణ, శారదలు ఎంతో బుద్ధిమంతురాళ్లా మౌనం వహించి చదువు కుంటున్నారు. తను ఆఫీసు నుండి రాగానే "నాన్నా" అంటూ పరిగెత్తుకొని వచ్చి చుట్టుకుపోయే చిన్నవాడు విష్ణు తన రాకను గమనించనట్టే యమ సీరియస్‌గా పలక మీద రాసేస్తున్నాడు.

"ఏమయిందిరా మీ కందరికి" అందర్నీ చూస్తూ అడిగాడు. ఎవరూ మాట్లాడలేదు. తమని కాదన్నట్లుగా ముఖాలు త్రిప్పుకున్నారు.

లోపలి నుండి భారతి కాఫీ తీసుకొని వచ్చింది.

"ఏమిటోయ్, ఇవాళ వాతావరణమంతా అదోలా ఉంది, ఏంటి సంగతి" నవ్వుతూ అడిగాడు కాఫీ కప్పు అందుకుంటూ. చిన్నగా నవ్వి వెనుదిరిగి వెళ్ళిపోయింది.

చిన్నప్పటినుంచీ డిటెక్టివ్ సాహిత్యం చదివిన కారణాన ఈవిడగారిదో సస్పెన్సు మనస్తత్వం, ఏ దానికీ తొందరగా జవాబు చెప్పదు. ఆలోచించండి అంటూ తనకే వైమిస్తుంది.

అరె, ఏమయింది వీళ్లందరికి ఈరోజు. ఎవరయినా వీరికి మాటలు రాకుండా మంత్రించిపోలేదు కదా. మళ్లీ కొంచెం కదిలించి చూద్దాం అనుకున్నాడు.

"ఒరేయ్ అంగదా. ఇప్పట్నుంచే కష్టపడి చదువుకుంటున్నావా తప్పు కదూ, చదువు కున్నవాడు ఎవడు బాగుపడ్డాడురా" తన





## బలహీనత

ఇంటి పేరును కిష్కింధగా మార్చిన తరువాత గురుమూర్తి ఇంట్లోని వారందరికి కూడా ముద్దు పేర్లు తగిలించాడు. ఉహూ, వాడు తలెత్తనే లేదు. వేలెడంతలేడు వెధవ, ఇప్పట్నుంచే ఎంత పట్టుదలో ?

"ఒరేయ్ ఆంజనేయా"

రవి తలెత్తి కోపంగా చూసి మళ్ళీ తల దించుకున్నాడు.

"అమ్మా జాంబవతీ !"

ప్చ్, అందరూ మహాపట్టుదలగా ఉన్నారు కిష్కింధలోనే సుగ్రీవుడికి చుక్కెదురా, ఎంత అవమానం ?!

ఎందుకో అతని నిశ్శబ్దాన్ని భరించలేక పోతున్నాడు. రోజులానే అల్లరి ఉంటేనే బావుంటుందనిపించింది.

"అయితే అందరూ అలా మాట్లాడకుండా ఉంటే మీ బాధేమిటో నాకెలా తెలుస్తుందిరా"

అప్పుడే వంటింట్లోంచి వస్తున్న తల్లి వైపు చూశాడు రవి.

"ఏమిటి తారా ఏంటీసంగతి, ఇకనైనా నస్పెన్సు విప్పు" అడిగాడు భార్యను.

"ఇప్పట్నుంచి పిల్లలు మీతో మాట్లాడరట"

"ఎందుకు, నేనేం చేశాను ?"

"రాత్రిపూట భోంచేయరట"

"ఎందుకే" అరచినట్టుగా అడిగాడు.

"మనమేమైనా పని చెబితే చేయరట"

"ఇప్పట్నుంచి డిటెక్టివ్ నవల్సు చదివావంటే తంతాను, అసలు కారణం చెప్పేడవమంటే ఏంటీ పీ డొంక తిరుగుడు. మొదట కారణమేంటో చెప్పు" మళ్ళీ అరిచాడు.

"ఇస్త్రీ పెట్టె కావాలట వీళ్ళకి" నవ్వుతూ చెప్పింది.

"నే నెప్పుడో చెప్పాను కదా, నేను కొనివ్వనని" కోపంగా అన్నాడు.

"అందుకే రాత్రిపూట అన్నం మానేశారు ఆ డబ్బుతో నయినా కొనిపెట్టమని."

"నేను డబ్బుల్లేక కాదు తేనంది. బ్రతకడానికే కష్టమవుతున్న ఈ రోజుల్లో మనలాంటి మధ్యతరగతి వాళ్ళు ఉన్న అలవాట్లలో కొన్నింటినయినా తగ్గించుకోవడానికి ప్రయత్నించాలి గాని కొత్తవి అలవరచుకోకూడదు"

చిన్నప్పటినుంచీ అంతే గురుమూర్తి. అతనికి కొత్త అలవాట్లు నేర్చుకోవాలన్నా, కొత్తదారుల్లో నడవాలన్నా భయం. ఒక రకమైన గానుగెద్దు జీవితానికి అంకితమై

### అతి పెద్ద పుస్తకాల షాపు

ప్రపంచంలో అతి పెద్ద పుస్తకాల షాపులలో ఒకటిగా పేరుగాంచిన పుస్తకాల షాపును యిటీవల టోక్యోలో ప్రారంభించారు. తొమ్మిది అంతస్తులలో వున్న యీ షాపులో సుమారు పది లక్షల పుస్తకాలున్నాయి. టోక్యోనగరంలో పుస్తకాల షాపులకు, ప్రచురణ కర్తలకు నిలయమైన కాండా ప్రాంతాలలో దీనిని నిర్మించారు. ఈ షాపులో పుస్తకాల అమరిక ఒక ప్రత్యేకతను సాధించుకున్నది. కేవలం పుస్తకాలనేకాక, పుస్తకాల గురించి విలువైన సమాచారాన్ని కూడా యీ కేంద్రం అందజేస్తుంది. ఈ కేంద్రంలో నెలకొల్పిన కంప్యూటరు పుస్తకాల ఎంపికలో సహాయకారిగా వుంటుంది.

వాయాడతను అందుకే సిగరెట్లు త్రాగడం లాంటి కవీస వ్యసనం కూడా లేదతనికి ఆఫీసు, ఇలు తప్ప మరింకే దాని గురించి ఆలోచించడు.

"నిజానికి ఇస్త్రీ పెట్టె అనేది పెద్ద లగ్జరీ వస్తువనను. ఇస్త్రీ బట్టలు తొడుక్కునేంత స్తోమత మనకు లేదనను. కాని ఇస్త్రీ బట్టలు తొడగకపోతే మనం బ్రతకలేమా. ఇస్త్రీ బట్టలు తొడగటానికి అలవాటుపడిన తరువాత మళ్ళీ ఇస్త్రీ చేయని బట్టలు తొడగలేం. అందుకే ఇలా బ్రతుకుతున్న వాళ్ళం ఇలానే ఉందాం" అన్నాడు గురుమూర్తి దృఢంగా.

* * *

నిజానికి ఇస్త్రీ పెట్టె అంతగా అవసరముంది ఈ మధ్యనే కాలేజీలో చేరిన రవికి మాత్రమే.

అదీ కో ఎడ్యుకేషన్ కాలేజీ కావడంతో ఒక్కొక్క విద్యార్థి టిప్‌టాప్‌గా తయారయి వస్తారు. రవి కున్నవి రెండేరెండు జతలు. అవీ టెరికాట్‌వి అయినా కావు. ఆ కాటన్ బట్టల్నయినా ఇస్త్రీ చేసుకుంటే గుడ్డిలో మెల్లగా ఉండేవేమో కాని ఇస్త్రీ చేయనందున అవి ఎప్పుడూ తోళ్ళలా వేలాడుతూ ఉంటాయి. అందుకే కాలేజీలో అందరూ "తోళ్ళోడు" అని ముద్దుపేరుతో వ్యవహరించసాగారు.

అయినా ఏమాత్రం ఫీలవకుండా కాలేజికి వెళ్తుండేవాడు కాని ఆ మధ్య తను చిన్నప్పటి నుండి కలిసి తిరిగి, తను ఆరాధిస్తున్న రాధిక ముందు ఎవరో తనను ముద్దుపేరుతో పిలిచే సరికి వింత సిగ్గనిపించిందని, అదోలా, జాలిగా రాధిక తలెత్తి తన వంక చూసినప్పుడు - మరీ బాధనిపించింది.

ఆ రోజే వచ్చి తండ్రిని గట్టిగా అడిగాడు. కాని గురుమూర్తి ఒప్పుకోలేదు. ఓ నెలాగితే బోనస్ వస్తుందని దానితో కొత్త బట్టలయినా కుట్టిస్తాను కాని ఇస్త్రీపెట్టె కొనన్నాడు. తండ్రి కుట్టించబోయే బట్టలెలాంటివో తెలుసు రవికి. అలాగే తండ్రి పెట్టుదల కూడా తెలుసు.

అప్పుడే సహాయనిరాకరణ సమ్మె ప్రారంభించి రెండు రోజులు కావస్తుంది. ఏం చేయాలి అని ఆలోచిస్తున్నాడు.

"ఒకసారి ఇస్త్రీ బట్టలు తొడగటానికి అలవాటు పడితే తిరిగి ఇస్త్రీ చేయని బట్టలు తొడగలేం" అన్న తండ్రి మాటలు అతనికి జ్ఞప్తికొచ్చాయి.

* * *

భర్తమీద వింతో కోపం ముంచుకు వస్తుంది భారతికి. మొదట తనే విందుకు ప్రస్తావించాలి అనుకొని అటుతిరిగిపడుకుంది.

వింత సేపటికి తనవైపు తిరగని భార్య నడుంపై చేయి వేశాడు గురుమూర్తి. చటుక్కున తీసిపారేసింది.

"ఏమిటోయ్ మహా నాడిపోతున్నావు" కావాలనే నవ్వుతూ అడిగాడు.

"మీరింత పిసినారి మనుషులనుకోలేదు" తిరక్కుండానే అంది.

"నువ్వూ నా పరిస్థితి అర్థం చేసుకోలేదన్నమాట, పిల్లలలా తినకుండా వస్తుంటే నేనేం బాధ పడడం లేదనుకున్నావా. కాని ఇంతదానికే నేను దిగివస్తే వాళ్ళు ప్రతి కోరికకూ ఇదే పద్ధతి ఉపయోగిస్తారు."

"మీరేం బాధపడనవసరం లేదులెండి. వాళ్ళు రాజీకొచ్చారు. పాపం ఏన్నాళ్ళని తినకుండా ఉంటారు."

"ఏంటట!"

"మీరు ఇస్త్రీపెట్టి కొనివ్వకపోయినా ప్రక్కింటివాళ్ళ దగ్గరుంచయినా తెచ్చుకొని చేసుకోవడానికి పర్మిషన్ అడుగుతున్నారు."

ఒక్క క్షణం ఆలోచించాడు. ఒప్పుకోకుండా ఉండడానికి అందులో పెద్ద అభ్యంతరమేమీ కనిపించలేదు. మహా అయితే నెలకు నాల్గయిదు రూపాయల కరెంటు బిల్లెక్కువ అవుతుంది.

"సరేలే. దానికేం భాగ్యం అలాగే చేసుకోమను" పక్కింటి వాళ్ళు కూడా విన్నాళని ఇస్తారు వీళ్ళకీ ఊరికే అడగాలంటే మొహమాటమే కదా అని సర్ది చెప్పుకున్నాడు.

రెండు రోజుల తరువాత ఆఫీసుకు వెళ్ళబోతూ ఆ రోజు తొడుక్కోవాల్సిన బట్టలకోసం వెతికాడు. "భారతీ, నా తెల్ల షర్టూ, బ్లూ ప్యాంటూ కనిపించడం లేదేమిటి?" అడిగాడు గురుమూర్తి భార్యను.

"అవతలి రూంలోని బీరువాలో ఉన్నాయి చూడండి" వంటింట్లోంచి చెప్పింది భారతి.

బీరువా తెరిచాడు లోపల ఇస్త్రీ చేసి ఉన్న బట్టలు కనిపించాయి.

"నా బట్టల్ని ఎవరు ఇస్త్రీ చేయమన్నారు వీళ్ళని" కోపంగా అరిచాడు.

"బావుందండి, మీరు కూడా నీటుగా వెళ్ళాలని పిల్లలేదో ప్రేమగా చేస్తే అంత కోపగించుకుంటారెందుకు? ఇందులో తప్పేముంది" చేతులు తుడుచుకుంటూ వంటింట్లోంచి వచ్చింది.

"ఏదో ఇలా కాలం వెళ్ళబుచ్చుతున్నాను. మళ్ళీ నాకెందుకే కొత్త అలవాటు" బట్టలు వేసుకుంటూ అన్నాడు.

"అబ్బ, భలే ఉన్నారండీ ఈ రోజు, మన పెళ్ళిచూపుల నాటిలా ఉన్నారు." నవ్వుతూ అంది.

"చాల్లే సంబడం, ఎవరయినా వింటే నవ్విపోగలరు" అంటూ బయటకు నడిచాడు.

మామూలు రోజు కంటె ఆ రోజెందుకో అతడు ఏదో క్రొత్తయిన అనుభూతి



# బలహీనత

చేందాడు. ఆ బట్టల్ని రెండు సంవత్సరాల నుండీ తొడుగుతూ వస్తున్నా ఇటువంటి అనుభూతిని ఎన్నడూ పొందలేదతడు. కొత్త బట్టల్ని కట్టుకున్నట్టనిపించింది. ఏదో కొంత ఆత్మవిశ్వాసం తనలో ఎక్కువయినట్లనిపించింది ఆ రోజెందుకో ఆఫీసు తొందరగా వచ్చిందనిపించింది.

''ఏమిటండోయ్ గురుమూర్తిగారూ ఏంటి విశేషం. కొత్త పెళ్ళి కొడుకులా తయారయి వచ్చారు'' అడిగాడు హెడ్‌గుమాస్తా.

''అబ్బె ఏం తయారయానండీ, మామూలుగానే వచ్చానే'' తడబడుతూ అన్నాడు.

''ఏదో కొత్తకళ కనిపిస్తేనూ'' నవ్వుతూ అన్నాడు.

''మాశావటోయ్ ఆనందరావు, ఎప్పుడూ తోళ్ళలా వేలాడే బట్ట లేసుకొచ్చే మన గురుమూర్తి ఈ రోజు కొత్తగా ఇస్త్రీ బట్టలు వేసుకొని వచ్చి ఎలా వెళ్ళిపోతున్నాడో'' అంటూ ఆనందరావుతో చిన్నగా అంటున్న మరో గుమాస్తా గొంతు అస్పష్టంగా వినిపించింది గురుమూర్తికి.

''ఛ, ఈ వెధవలెప్పుడూ ఇంతే. ఒకరి మంచిని ఓర్వలేరు'' మనసులోనే కోపంగా అనుకున్నాడు.

''గుడ్‌మార్నింగ్ గురుమూర్తిగారూ'' అంటూ వచ్చింది టైపిస్టు రాణి.

తనను చూడగానే ఎప్పుడూ ముఖం చిట్లించి ముభావంగానే తలతిప్పుకునే రాణేనా తనతో నవ్వుతూ మాట్లాడుతుంది.

''గుడ్‌మార్నింగండీ, ఏంటి విశేషాలూ'' చిరునవ్వుతో అడిగాడు.

''మీరే చెప్పాలి. ఈ రోజు మీ బర్త్‌డే కాదు కదా.''

''ఛ, నా కటువంటి ఫార్మాలిటీస్ లేవండి. ఏం, ఎందుకలా అనుకుంటున్నారు.''

''ఆహాఁ ఏం లేదు, మీలో ఏదో విశేషం కనిపిస్తేనూ'' అని వెళ్ళిపోయింది రాణి.

''ఒరేయ్. ఇక మనం అస్త్ర సన్యాసం చేయాల్సిందేరా, గురుడు లైన్లో పడ్డట్టున్నాడు'' అనే గుసగుసలు వినిపించాయి.

''అలాగే ఉన్నట్టుంది లేకుంటే ఎన్నడూ లేనిది రాణి అంత వగలుపోతూ అతనితో మాట్లాడుతోంది'' మరో గుస గుస.

ఇంతలో గురుమూర్తిని ఆఫీసరు గారు

పిలుస్తున్నారని ప్యూను వచ్చి చెప్పాడు.

ఇదేంటి, ఎప్పుడు ఆఫీసరు గారు పిలిచినా వణక్కుంటూ వెళ్లే తను ఈ రోజు ఇంత ధైర్యంగా తలెత్తుకొని వెళ్తున్నాడేంటి?

ఏదో ఆఫీసు విషయాలు మాట్లాడి "గురుమూర్తీ, నేనోమాట అడుగుతాను ఏమనుకోవుగా" అన్నాడు ఆఫీసరు శ్రీకాంత రావు

"అమ్మమ్మ మీరడగటానికేం అభ్యంతరం సార్, అడగండి"

"నీ కెన్నేళ్ళు"

తన వయసు గురించిన భోగట్టా ఆఫీసరు గారికి ఎందుకవసరమో అర్థంగాక కొన్ని క్షణాలు అయోమయంలో పడి "నలభై సమీపిస్తున్నాయి సార్" జవాబిచ్చాడు.

"ఈ మాటను నివ్వు మొన్నయితే అసలు నమ్మేవాడినే కాను. ఈ రోజు నమ్ముతాను. రోజూ ఇలానే ఫ్రెష్‌గా, నీటుగా తయారయిరా, ఏదో చమవుకొద్ది చెబుతున్నాను ఏమనుకోకు గాని నా వయసు ఏంతుంటుందంటావు?"

"నా కంటే ఏ రెండు మూడు సంవత్సరాలో పెద్దయి ఉంటారు సార్"

"అక్కడేనోయ్ నీవేకాదు అందరూ పొరపడేది; నీవు నమ్మవు గాని వచ్చేనెలతో నాకు అరవై పూర్తవుతాయి" కంఠంలో కించిత్తు గర్వం తొణికిసలాడు తుండగా చిద్విలాసంగా అన్నాడు శ్రీకాంతరావు.

"ఈజిట్ సర్" నిజంగానే ఆశ్చర్యపోయాడు గురుమూర్తి.

"ఇలా ఎందుకున్నానంటావ్. ఎప్పుడూ నవ్వు ముఖంతో, నీటయిన దుస్తులతో ఉంటే నిజంగానే మన కాయుష్షు పెరుగుతుందయ్యా నీ కెన్నాళ్ళనుండో చెబ్దామనుకుంటున్నాను ఈ విషయం. ఈ రోజు లాగే ఇప్పట్నుంచయినా ఫ్రెష్‌గారా ఆఫీసుకు"

"అలాగే సర్" అని బయటకు వచ్చాడు.

*  *  *

ఆ రోజు ఆఫీసుకు వెళ్లే ముందు చూసుకుంటే బట్టలు ఇస్త్రీ చేసి లేవు.

# బలహీనత

"ఏరా రవీ, నా బట్టలు ఇస్త్రీ చేయలేదు" అడిగాడు గురుమూర్తి.

"లక్ష్మీనారాయణ గారి ఇంట్లో అడిగితే తమది పాడయిందని చెప్పారు నాన్నా"

"పోనీ సీతారామయ్య గారింట్లో అడగక పోయారా."

"అడిగాం, సీతారామయ్యగారింట్లోనే కాదు రాంబాబు గారింట్లో, కామాక్షమ్మ గారింట్లోనూ అడిగాం. ఎవ్వరూ ఇవ్వలేదు."

బదులు మాట్లాడకుండా బట్టలు వేసుకుని బయటకు నడిచాడు. కాని నిన్నటి మొన్నటిలా వేగంగా, చురుకుగా ఆఫీసుకు నడవలేక పోతున్నాడు. ఇన్ని రోజులు ఇస్త్రీ బట్టలు తొడిగి ఇప్పుడిలా ఇస్త్రీ చేయని బట్టలు తొడిగినందుకు ఏదో ఇబ్బందిగానూ, ఇరుకుగానూ, నిరుత్సాహంగానూ అనుభూతి చెందుతున్నాడు.

అయ్యో ఆఫీసులో అందరేమంటారో, హెడ్డుగుమాస్తా ఏమంటాడో, ఆనందరావు ఎంత నవ్వుతాడో, టైపిస్టు రాణి మళ్ళీ ముఖం చిట్లిస్తుందో కాబోలు, ఆఫీసరుగారు చీవాట్లు పెడతారేమో.

ఏంటి ఈ బట్టలు ఇంత బరువుగా అనిపిస్తున్నాయి. ఎక్కడలేని నీరసం తనను ఆవహించినట్లయింది. ఛ, ఎందుకో ఇలా ఆఫీసుకు వెళ్ళబుద్ధి కావడంలేదు. తనే ఇంతగా ఫీలవుతూ ఉంటే యవ్వనంలో ఉన్న రవి ఎంత అవమానంగా, సిగ్గుగా బాధపడతాడో? అఫ్టరాల్ ఇస్త్రీ పెట్టే కదా, కొంటే ఏం పోయింది. రోజూ ఆఫీసుకు ఎంత దర్జాగా వెళ్ళొచ్చు.

ఎదురుగా ఆఫీసుకు వెళ్తూ ప్యూను అప్పలస్వామి కనిపించే సరికి కేకేసి పిలిచాడు. "నేను ఇప్పుడు ఆఫీసుకు రావడంలేదు. మధ్యాహ్నం వచ్చి సి.ఎల్.కు అప్లై చేస్తానని చెప్పు ఆఫీసరు గారికి" అని చెప్పిన తరువాత గాని మనసు ఊరట చెందలేదు గురుమూర్తికి.

* * *

సాయంత్రం కాలేజీ నుంచి వచ్చిన రవి తండ్రి తెచ్చిన కొత్త ఇస్త్రీ పెట్టెను చూసి తన ప్లాను విజయవంతం అయినందుకు సంతోషించాడు. కాని ఆ ప్లాను ద్వారా తండ్రి బలహీనతపై చిన్న దెబ్బ కొట్టినందుకు కించిత్తు బాధపడ్డాడు కూడా.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## సలక్షణ ఘనపాఠి శ్రీ పాండురంగాచార్యులు :

సలక్షణఘనాంత కృష్ణ యజుర్వేద విద్వాంసులు శ్రీ పాండురంగాచార్యులు పనస చెబుతూంటే వీనుల పండువుగా ఉంటుంది. అర్థంకాకపోయినా, ఇంకా కొంతసేపు విందామనిపిస్తుంటుంది. ఆయన గర్భాష్టమంలో వేదాధ్యయనం ప్రారంభించి, వేదోపాధ్యాయ వృత్తి నవలంబించి, వందలాది శిష్యప్రశిష్యులను రూపుదిద్దిన ఉపాధ్యాయ వతంసులు. ఆయన వేద విద్వాంసుల వంశంలో జన్మించారు ఆయన. వేదమూర్తి కాకమర్లేపుత్తూరు ఆయన జనకులు క్రమాంతాధ్యయనం చేసి, పౌండరీకాంత శ్రౌతం కృష్ణంగా వేసిన శ్రీ కొడిచెర్ల రాఘవాచార్యులు గారు. జ్యేష్ఠ భ్రాత శ్రీ వేంకటాచార్యులు కూడ సలక్షణ ఘనాంతస్వాధ్యాయులు, నిష్ఠాపరులు. శ్రీ పాండురంగాచార్యులు 1920లో మహబూబ్‌నగర్ జిల్లా వనపర్తి తాలూకా అంకూర్ గ్రామంలో జన్మించారు. తమ జనకుల వద్దనే నాలుగు కాండల సంహిత, షోడశకర్మలు అధ్యయనం చేశారు. పిదప మైసూరు మహారాజ గురువులైన శ్రీ రంగనాథ బ్రాహ్మతంత్ర పరకాల మఠాధీశ్వరుల అదేశాను సారం ఘనాంతాధ్యయనం కోసం మైసూరు వెళ్లారు. అక్కడ ఆ పరకాల మఠాధీశ్వరుల నిర్వహణలో ఉన్న వేదపాఠశాలలో క్రమాంతం అధ్యయనంచేసి, మైసూరు విశ్వవిద్యాలయానికి చెందిన మహారాజా సంస్కృత కళాశాలలో క్రమాంత పరీక్షలో ప్రప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనారు. పిదప, ఆ కళాశాలలోనే సలక్షణఘనాంతం అభ్యసించి, ఆ పరీక్షలోను ప్రప్రథమ శ్రేణిలో గెలుపొంది, అప్పటి మైసూరు మహారాజా శ్రీ జయచామ రాజేంద్ర ఒడయార్ నుంచి దుశ్శాలువలు, నాదు బహుమానం పొందారు. శ్రీ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాల మఠాధీశ్వరులు నిర్వహించే శ్రీ వేదాంత దేశిక విహారసభలలోను సలక్షణ ఘనాంత పరీక్ష యిచ్చి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై ఘన సన్మానం పొందారు. విద్యార్థి దశ సమాప్తమయిన పిదప శ్రీ ఆచార్యులుగారు వేములవాడ వేద సంస్కృత కళాశాలలో వేదోపాధ్యాయ వృత్తిని బుధజన శ్లాఘనీయంగా నిర్వహించారు. పిదప హైదరాబాద్‌లోని శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధినీ సంస్కృతకళాశాలలో వేదోపాధ్యాయులుగా పనిచేసి విరమించినారు 1966లో శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు కాళహస్తిలో నిర్వహించిన సలక్షణ ఘనాంత పరీక్షలో ప్రశంసనీయంగా ఉత్తీర్ణులై సన్మానం పొందారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వేద విద్యాపారంగతులను సన్మానించడానికి ప్రారంభించిన ప్రణాళిక కింద 1970లో ఉత్తమ సలక్షణ ఘనపాఠిగా వేయినర్పాటపదార్లు, శాలువలతో సన్మానితులయ్యారు. ఆ సంవత్సరమే యాదగిరి లక్ష్మీ నరసింహస్వామి దేవాలయంలో వేదార్థంపై ఉపన్యసించి బహూకృతులయ్యారు. 1979లో రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ఉగాది సందర్భంగా శ్రీఆచార్యులుగారిని సన్మానించారు. ప్రస్తుతం తిరుమల తిరుపతి దేవాలయంవారు శ్రీ పాండురంగ చార్యులుగారిని వేదసంరక్షణ ప్రణాళిక కింద వృద్ధ పండితులుగా పరిగణించి నెలకు 200రూ.లు ప్రకారంయావజ్జీవ ఉపకారవేతనం ఏర్పాటుచేశారు. శ్రీ ఆచార్యులుగారు కృష్ణ యజుర్వేద నిధులు. షోడశకర్మలు చేయించే స్మార్త విద్వాంసులు. శ్రీమద్వాల్మీకిరామాయణంఆమూలాగ్రం వాచోవిధేయమై, రామాయణ రహస్యాలను ఉపన్యసించ గల దిట్టలు. ఆయన నుంచి ఆంధ్ర దేశం వేదరహస్యాలను, రామాయణ విశేషాలను గ్రహించాలి. యుగధర్మానుగుణంగా ఆత్మధర్మాన్ని ఆచరిస్తూ ప్రాచీన భారతీయ విజ్ఞానానికి పెట్టని కోట అయిన శ్రీ ఆచార్యులుగారు మా నలభై సంవత్సరాలు వేదోక్తంగాజీవించి తమజ్ఞానాన్ని తెలుగు ప్రజలకు పంచుదురు గాక!

## లలితకళా విశ్వవిద్యాలయం :

రాష్ట్రంలో లలితకళలకు విడిగా ఒకవిశ్వవిద్యాలయం స్థాపించాలని తాను భావిస్తున్నట్టు ముఖ్య మంత్రి శ్రీ టి. అంజయ్య జులై 5,6,7 తేదీలలో జరిగిన రాష్ట్ర ఆస్థాన సంగీతవిద్వాంసుడు శ్రీ బాల మురళీకృష్ణ జన్మదినోత్సవాలను ప్రారంభిస్తూ అన్నారు. రాష్ట్ర ప్రభుత్వం సంగీత నృత్య నాటకాది లలిత కళల వ్యాప్తికి సకల విధాల సహాయం చేస్తున్నదని, దేశంలోనే ప్రప్రథమంగా రాష్ట్రంలో నెలకొల్పనున్న లలిత కళా విశ్వవిద్యాలయానికి కళాకారులందరూ సహకరించాలని ఆయన కోరారు. ఈ ప్రారంభోత్సవానికి రాష్ట్ర విధాన సభ స్పీకరు శ్రీ కోన ప్రభాకరరావు అధ్యక్షత వహించి, బాలమురళీ కృష్ణ అపూర్వ సంగీతప్రతిభను ప్రశంసించారు. ఈ ఉత్సవ సందర్భంగా ఆరుగురు ప్రముఖులు సన్మానించబడ్డారు. మొదటి రోజు మద్రాసు నర్తకదంపతులు శ్రీయుతులు శ్రీ దయానందన్, శ్రీమతి శాంతా దయానందన్, డాక్టర్ సి. నారాయణరెడ్డి [పరోక్షంగా]. రెండవరోజు విశ్వవిఖ్యాత విద్వాంస విశారదుడు డాక్టర్ బి. వి. రామన్, సౌండ్ ఇంజనీర్ శ్రీ రఘునాథన్ సన్మానితులయ్యారు. మూడవ నాడు శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు, విశ్వవిఖ్యాత ఆహార్య నిపుణుడు, డాక్టర్ షస్, డాక్టర్ వైద్యుల చంద్రశేఖరం సన్మానించబడ్డారు. మూడవ నాటి కార్యక్రమం విద్యుచ్ఛక్తి లేనందున కొవ్వొత్తుల వెలుగున జరిగింది. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ కోన ప్రభాకరరావు రవీంద్ర భారతిలో జనరేటర్ లేనందుకు రాష్ట్ర ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించారు. ఈ ఉత్సవాన్ని మద్రాసు మురళీరవళి ఆర్ట్స్ సెంటర్ ఏర్పాటు చేసింది.

## పీడకల:

జూలై 13వ తేదీ నుంచి నగరంలో చెలరేగిన దమ్మున్యకాండ పీడకల పదిరోజుల తర్వాత తొలగి

ఏవిటి! ఒక్కసారిగా ఇంత పెద్ద ఇల్లు కట్టేసారు? లాటరీ ఏమయినా తగిలిందా?!

అదేం లేదు! ఈమధ్య మావారికి ఒక రోజు మంత్రి అయ్యే అవకాశం కలిగింది! అంతే!!

## హైదరాబాద్ నోట్‌బుక్

పోయింది. పాత నగరంతోపాటు పెక్కు చోట్ల విధించబడిన కర్ఫ్యూ జూలై 23న పూర్తిగా తొలగింది. అల్లర్ల సందర్భంగా కొందరు విధాన సభ సభ్యులతోసహా కొన్ని పందల మందిని పోలీసులు అరెస్టు చేశారు. అల్లర్ల పూర్వాపరాలను తెలుసుకొనేందుకునిష్పక్షిక న్యాయ విచారణ జరిపించాలని భారతీయ జనతాపార్టీ అధ్యక్షుడు శ్రీ అటల్ బిహారీ వాజపేయిహామున్నగు రాజకీయనాయకులు ప్రభుత్వాన్నికోరారు. ఈఅల్లర్లకు దాదాపు 30మంది అమాయకులు బలి అయ్యారు.

**అధికారభాషా కమీషన్ నూతనాధ్యక్షుడు :**

సుప్రసిద్ధ కవి డాక్టర్ సి. నారాయణరెడ్డిని రాష్ట్ర ప్రభుత్వం అధికార భాషా సంఘం అధ్యక్షుడుగా నియమించింది. ఈ విషయాన్ని ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య డాక్టర్ నారాయణరెడ్డి 50వ జన్మదినోత్సవ సందర్భంగా వంశీధియేటర్స్ వారు రవీంద్ర భారతిలో జూలై 19వతేదీన ఏర్పాటుచేసిన సభలో ప్రకటించారు. ఈ సందర్భంలో డాక్టర్ నారాయణరెడ్డి రచించిన 'సమీక్షణ, అమెవ్యాసాల సంపుటిని భారీ పరిశ్రమల మంత్రి శ్రీ ఎం. బాగారెడ్డి ఆవిష్కరించారు. డాక్టర్ రావూరివెంకటసత్యనారాయణరావురచించిన వెన్నెలతెరచాప పుస్తకాన్ని సాంస్కృతిక శాఖామంత్రి శ్రీభాట్టం శ్రీరామమూర్తిఆవిష్కరించారు.

**ఉపశ్రుతి :**

'ఏం సార్ మీరారు పాత స్వాతంత్ర్య యోధులు గదా . ఇలాగే ఉన్నారే, ఏ పదవీలేక ?! అని ఒక వృద్ధ నాయకుని అడిగాను. ప్రక్కనే ఉన్న తిరుపతి పాత్రికేయుడుశ్రీ రామాయణం మునిరత్నం కాళ్ల పత్తేవారికి, జాళ్ల ఎత్తేవారికి, కాసులు విసిరేవారికీ ఏ పదవైనా వస్తుంది అన్నారు. ఎంత మాట ! ఎంత మాట ! అని నోరునొక్కుకున్నాను.

# పటిష్టమైన జాతీయ సమైక్యత



## రాష్ట్ర ప్రభుత్వ లక్ష్యం





శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

★ ఆంధ్రప్రదేశ్ పవిత్ర దేవాలయాలకు, మసీదులకు, గురుద్వార్‌లకు, చర్చిలకు నిలయం.

★ ఆంధ్రప్రదేశ్ ప్రజలందరు మతపరమైన పండుగలను కలిసికట్టుగా జరుపుకుంటారు.

★ కుల, మత విచక్షణ లేకుండా ఇక్కడి ప్రజలందరూ జాతర్లలోనూ, మేళాలలోనూ, ఉర్సు ఉత్సవాల్లోనూ పాల్గొంటారు.

★ సంఘీభావంతో కష్టించి పని చేయడంద్వారా పరిశ్రమలు, వ్యవసాయం, విద్య మొదలగు వివిధ రంగాల్లో మనం ప్రశంసనీయమైన ప్రగతిని సాధించాం. ఈ సంఘీభావాన్ని యిదే విధంగా కొనసాగిద్దాం.

★ సంఘ వ్యతిరేక శక్తుల కార్యకలాపాలను అరికడదాం.

★ సాంఘిక దురాచారాలను నిర్మూలించడంలో ప్రభుత్వంతో సహకరిద్దాం.

★ వదంతులను నమ్మవద్దు.

★ శాంతి భద్రతలను నెలకొల్పడంలో ప్రభుత్వంతో సహకరించడం ప్రతి పౌరుని కర్తవ్యం.

★ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ, ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య చైతన్యవంతమైన నాయకత్వంలో మన రాష్ట్రం పేరు ప్రతిష్టలను యినుమడింపచేద్దాం.

---

సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.

D.I.P.R No. 37402/Advt/Cl-3/81









# ఉత్తరాలు

(6 వ పేజీ తరువాయి)

## "సిగ్గుచేటు"

'హౌరా—గుణుపూర్' రైలు మార్గం శీర్షిక చూచి, చదివి నేను ఎంతో గర్వించినాను. కారణం బాల్యంనుండి ఆ రైలుతో వున్న అనుబంధం అటువంటిది. ఒకనాడు రాజాగారు ఆట వస్తువుగా వుపయోగించుకున్న ఆ రైలు నేడు కొన్ని వేల మంది ప్రయాణీకుల ఆత్మబంధువు, వేలరూపాయల సరుకును రవాణా చేస్తున్న కల్పవృక్షము, టిక్కట్ లేకుండా ప్రయాణం చేసే వాళ్ళపాలిట కామదేనువు కూడ. ఇంత గొప్ప వింతైన రైలు మార్గం పై అందించిన శీర్షికచూసి యిటు ఆ ప్రాంతపు ప్రజలకు గాని, ఆ రైలు మార్గం పై ఆధారపడి పని చేస్తున్న వుద్యోగులలో గాని ఎటువంటి భావనను కలిగించక పోవటం సిగ్గు చేటుగా వుంది.

గురువెళ్ల గోవిందరావు (ఖరగ్ పూర్)

## అసహజం

17.7.81 సంచికలోని కథ 'పెనుభూతం' మరీ విడ్డూరంగా వుంది. నేడు వైద్య వృత్తిలో అక్కడక్కడా జరుగుతున్న సంఘటనలు— లోపాలు, రచయిత దృష్టిలో పెట్టుకొని, ఎత్తి చూపటంలో తప్పు లేదనిపించినా, పోర్‌సెప్స్ కడుపులో వదిలెయ్యడం సమంజసం కాని, తొడలోనూ, తలలోనూ వదిలెయ్యడం అనేది అసహజం. మైనర్ ఆపరేషన్ అన్నారు. తొడలోనుంచి పోర్‌సెప్స్ తీసే లోపల అతడు ఆపరేషన్ టేబిల్ మీదే ప్రాణాలు వదలడం ఇంకా అసహజంగా ఉంది.

పి.బి. సరోజినీ ఉదయకుమార్ (సీటాపురం)

## సీరియల్

17—7—81న తేదీన వెలువడిన మీ (మా) పత్రికలో నటికల్పనా అయ్యర్ ముఖచిత్రం చూచి చాల నిరుత్సాహపడినాము. రాగజ్వాల సీరియల్ మేము వూహించని మలుపు తిరిగినది. నర్సింగ్‌హోం సీరియల్ చాల యింటరెస్ట్‌గా వున్నది.

వోడవారి నాగమణి, బి. పద్మావతి (పేరూరు)

## కథలు

10.7.81 తేది వెలువడిన శ్రీదేవి ముఖ చిత్రపు పత్రికలో 5 కథలు ప్రచురించారు. ఇందులో వూపిరి, చక్రబంధం, డిస్కో బాగున్నాయి. మీరు వారంవారం ప్రచురించేకథల సంఖ్య ఒక్కోసారి చాలా తక్కువగా అంటే రెండు, ఒక్కోసారి చాలా ఎక్కువగా 'అంటే ఐదు' ఉంటాయి.

ఎస్. అబ్బర్‌హుస్సేన్ [హరి]

10.7.81 వ తేదీన పత్రికలో ప్రచురించిన 'కొమ్మిడి మత్స్యేంద్రరెడ్డి రచన "వూపిరి" ప్రశంసనీయము. ఆ కథ చదువుచున్నంత సేపూ ప్రకృతి సృష్టించిన వూపిరిని పీల్చకుండా రచయిత వూపిరినే నేనువూపిరిగా పీల్చానుఅనడంఅతిశయోక్తి అయినా సమంజసమైనది. దానిని ప్రచురించిన మీకు, అటువంటి చక్కటి కథను సమాజం నుంచి సేకరించి అద్దం పట్టిన రచయితకు కృతజ్ఞతాభివందనములు.

కె. రామకృష్ణ (పుదిపట్ల)

* * *

10.7.81 శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాల బాగుంది. కథలన్నీ చాలా బాగున్నాయి. ముఖ్యంగా 'డిస్కో' కథ చాలా చాలా బాగుంది. రాగ జ్వాల సీరియల్ ఆసక్తికరంగా ఉంది. మంచి కథలు ప్రచురిస్తున్న మా అభిమాన ఆంధ్రపత్రిక వారికి కృతజ్ఞతలు.

బి. నళిని, బి. అరుణ [ఏలూరు]

* *

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన నా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక 10.7.81 లో "వూపిరి" కథ నాకు ఎంతో నచ్చింది. శివాని వంశీకృష్ణ పై చూపిన ఆప్యాయత ప్రేమ (స్నేహం) శివానివంటివారు ఈ నాగరిక ప్రపంచంలో ఉన్నారంటే అతిశయోక్తి! ఉన్నా అటువంటి వారు నూటికి ఒక్కరుతప్పితేఇద్దరిగా ఉంటారేమో! రచయిత కొమ్మిడి మత్స్యేంద్ర రెడ్డి గార్కి నా అభివందనలు.

గంధం సత్యవేణి [క్రాప]

* * *

ఈ వారము వారపత్రికలో బాలలూ మీకు జోహార్లు అనే కథ చాలాఇంటరెస్టుగావున్నది.ముఖ్యముగా దేవుడు చూస్తూనే వున్నాడు అనే సీరియల్ చాలా బాగున్నది. ఈ సీరియల్ వ్రాసిన భాగవతుల సుబ్రమణ్యంగారికి నా కృతజ్ఞతలు.

కె. కాశేశ్వరరావు (గుంటూరు)

* * *

సూర్యదేవుని రథచక్రం ముఖ చిత్రంతో వెలువడిన 24—7—81 తేదీ పత్రిక చాలా బావుంది. "పరీక్ష" ఈ రోజుల్లో చదువుతున్న బీద విద్యార్థులు అంటే గొప్ప కులాల్లో పుట్టిన వారు కూడా ఎన్నికష్టాలు పడుతున్నా ప్రభుత్వం గుర్తించక వెనుకబడిన వారికి ప్రాధాన్యత ఇస్తున్న ప్రభుత్వానికి తెలియపరచిన ఈ కథ నన్నెంతో ఆకర్షించింది. "సహనానికి పరీక్ష" కూడా చాలా బావుంది. ఆడవాళ్లని అబలలుగా చూసే నేటి సమాజంలో మగవాళ్లకి గుణపాటంగా ఉంది.

ఎల్. ఆర్. రాజేశ్వరి (పిటాపురం)


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gaadhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# సీట్లు కోసం పాట్లు....

-శేఖర.. సురేష్


















ANDHRA SACHITRA VARA PATRIKA




వారెవ్వా! వహ్వా!
ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!

PIES FOR SALE

it's better to have pie fought than not at all

CAUTION
PIE FIGHT IN
PROGRESS

ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా యే మజా!